మరియు జీససు చెప్పినట్లు,

**"Blessed are the merciful : for they shall obtain mercy."—Mathew, V, 7.**

రెండు:—ఈ యోగము ట్రీట్మెంటుకై యేర్పడలేదనువారికి శ్రీ శాస్త్రి గారు ట్రీట్మెంటులే లేనిచో నిది యెవరికి కావలయును? అని సమాధానము చెప్పెడివారు. అభ్యాసకాలమున శరీరమున జరుగు కొన్ని స్పందనముల కొఱ కెవ్వరు దీని నాశ్రయింపరు అని పలికెడువారు.

ఇంకను శ్రీ శాస్త్రిగారి సాధన వారి ప్రకృతి ననుసరించి విశిష్టమార్గ మవ లంబించె నని తోఁచును. ఆత్మచింతన పథము కూడ సత్యదయోపకార సార్థక ముగ నుండవలెనని వీరి నిశ్చయము. వీరి ఆత్మార్పణా విధానము జీమూతవాహ నుని కథను, బౌద్ధ జాతక కథలను స్మృతికిఁ దెచ్చును.

వీరి కడ ట్రీట్మెంటు పడయఁగోరి చేరినవారు ఆరోగ్యమును బడసిన పిమ్మట తమ కారోగ్యమును ప్రసాదించిన దివ్యతత్త్వమును అన్వేషించెడివారు. మఱియు తమ బాధనెపముగ వారు సర్వాంతర్యామి నెఱుకకు దెచ్చికొన ప్రయ త్నించెడివారు. ఒరుల క్లేశము నపనయించుటకు చికిత్సకుఁడు వారితో నైక్యతను భావించనిదే ఫలము కలుగ దని వ్రాసితిని. ఇట్టియెడ ట్రీట్మెంటు అనేకముగా గన్పట్టుచు నేకమగు పదార్థమును గురుతించుటలో నొక యభ్యాసముగ పనిచేయు చున్నది. మనలను మనము చూచికొనుట కేర్పడిన భృకుటిరహిత తారక రాజ యోగసాధనకు ట్రీట్మెంటుపద్ధతి సహాయకారియే యగుచున్నది. ఆవసరము కూడ నగుచున్నది.

మరియు – ఇతరుఁడు బాధపడుచుండఁగా చూచి యోగి యూరకుండు టెట్లు?

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖమ్ స యోగీ పరమో మతః"

భగవద్గీత *VI.* 32.

"ఓ యర్జునా! ఎవఁడు సుఖములోను దుఃఖములోను సర్వులను తనవలెనే చూచునో వాఁడు పరమయోగి" అను భగవద్గీతా ప్రబోధమును గూడజ్ఞప్తికిఁ దెచ్చుకొందము గాక!

## భృక్తరహితతారక రాజయోగము

శ్రీ శాస్త్రిగారు ట్రీట్మెంటులో బాగు చేసిన వారితో ఆ బాగు చేయునది తాము కామనియు సర్వాంతర్యామి, సర్వదయామయుఁడు నగు ఈశ్వరుఁడే యనియు చెప్పెడివా రని వ్రాసితిని. వారి గురుదేవులే సాక్షాత్పర బ్రహ్మము! కాని వారి పేరైన ఎన్నడును ఉచ్చరించెడివారుకారు. కారణము- ఈ యోగమును గూర్చి ప్రచారము చేయవల దని సాధకులను వారి గురుదేవులు శాసించియుండుటయే! చరమదశవరకును శ్రీ శాస్త్రిగా రీ నియమమును పాటించెడివారు. అంతియే గాక ఆ యొరవడినే తమ్ముగూర్చి గూడ ప్రచారము నిరోధించెడివారు శ్రీ శాస్త్రిగారు. అందుచేతనే లోకమున వారి కృషి తెలియఁదగినంతగా తెలియఁబడలేదు. వారివలన ఉపకారము పొందినవారిలో కొందఱును, వారి యాంతర్యము నెఱిఁగిన మిత్రులు కొందఱును పత్రికాముఖమున వెల్వరించిన దుఃఖపు వెల్లువవలననే పలువురు మొదటిసారిగా వీరు యోగసాధకులని తెలిసికొనిరి. ఎవఁడు లోకమును వీడిన పిమ్మట లోకము వానిని కృతజ్ఞతతో స్మరించునో అట్టివాని పుట్టువుగదా ధన్యము!

శ్రీ శాస్త్రిగా రవలంబించినది భృక్తరహితతారక రాజయోగము. దీనిని 1910 లో కుంభకోణమున నొక మహాపురుషుఁడు స్థాపించెను. వారి నామాక్షరములే ఈ యోగమునకు మూలమంత్రము. వారిని స్మరించి నమస్కరించిన వారికి బ్రహ్మజ్ఞాన మిత్తు నని వారి ప్రతిన. బ్రహ్మైక్యమును పడయవలసినది

ఏదో సమాధిదశలోనో లేక దేహము విడచిన పిమ్మటనో గా దనియు, ఈ ప్రజ్ఞ తోనే ఈ లోకముననే ఈ దేహముతోనే యనియు వారి మతము. వీరు చెప్పిన వానిని బోలినకొన్ని విషయములు పూర్వగ్రంథములందుండవచ్చును. కానీ వీరు ఏ గ్రంథముపైనను ఆధారపడి యీ యోగమును ఆరంభింపలేదు. అది కేవలము నూతన సృష్టి! వీరు సర్వస్వతంత్రులు! మిగుల మహిమాన్వితులు! వీరి నీ మండలివారు సాక్షాత్పరబ్రహ్మముగా తలఁతురు.

పూజ, భజన, హారతి మొదలగు బాహ్యచిహ్నము లేవియు వీరు వల దందురు. వీరిని తలఁచి నమస్కరించినచో శరీరములో యోగక్రియ ఆరంభ మగును. సాధకునివంతు సాక్షిమాత్రముగ తనలో జరుగుమార్పులను గమనించు టయే. ముద్రలుగాని, ఆసనములుగాని, ప్రాణాయామముగాని, హఠయోగాభ్యాసము గాని అక్కఱ లేదు. వానిని నిషేధింతురుగూడ! అభ్యాసకాలమున ప్రజ్ఞ సాధ కుని స్వాధీనములోనే యుండును.

ఆహారవిషయమున కఠిననియమము లేవియు లేవు. శరీరమునకు చల్ల దనమును, పుష్టిని కల్గించు సాత్త్వికాహారము తీసికొనవలెను. సాధనకై ఇల్లు వాకిలి వదలరాదు. సన్యాసము పనికిరాదు. ఎవరివృత్తి వారు సాగించుచునే సాధన చేయవలెను. సాధకులు త మ్మితరులు గుఱుతించుటకై ఎట్టి యార్భాట మును ప్రకటింపరాదు. ఈ సాధనవలన అనేక మహత్తులు లభించును. వీని నెన్నఁడును దుర్వినియోగము చేయరాదు మఱియు అవి ప్రధానములును గావు. ఈ యోగ గౌరవమునకు తగినట్లు సాధకులు తమ ప్రవర్తనను నీతి మార్గమున నడపించుకొనవలెను.

ఇంకను ఈ యోగమును గూర్చి వ్రాయఁదగిన దెంతయో కలదు గాని ప్రస్తుతమున కింతయే చాలు నని విరమించుచున్నాను

గుంటూరు

ఖర

శ్రావణ బహుళ విదియ

కొత్త వెంకటేశ్వరరావు

# మలిపలుకు

మీది విషయ మంతా 30 ఏళ్ళ క్రిందట వ్రాసినది. అప్పుడు నా వయసు ముప్ఫైయెనిమిది. ఆధ్యాత్మిక మార్గాన నన్ను తీర్చిదిద్దిన పూజ్య గురువర్యుల సంతాపకరమైన హఠాన్మరణ సన్నివేశము నేను దగ్గర ఉండగా జరిగినదే. కనుక అప్పట్లో చకితుడనై నేను వ్రాసిన వ్రాతలో ఎక్కడైనా ఒకటి రెండు పంక్తులు కొద్దిగా అతిశయోక్తులేమో అనుకోదగిన రీతిని దొరలితే దొరలి ఉండవచ్చునేమో గాని మొత్తం మీద ఈ ముప్పది యేండ్ల తర్వాత నా అరవై యెన్మిదవయేట దీనిని తిరిగి చదివి చూచుకొన్నప్పుడు అంతా చాలా మట్టుకు యథార్థమే అని ఇప్పుడూ తోస్తున్నదని వినయపూర్వకంగా నివేదించుకొంటున్నాను. నా ఆధ్యాత్మిక గురువులైన శ్రీవారి యోగచికిత్సా విధానపు మహిమకు,అది నేటికీ కొనసాగుతున్న దన్న యాథార్థ్యమునకు, వారి శిష్యగణములో తిరుపతిలోని శ్రీనివాసాచార్యులు గారిని, గుంటూరులో రామకోటయ్యగారిని ప్రమాణముగా ఉదాహరింప వచ్చును.

శ్రీ శాస్త్రిగారనుసరించిన ఈ నూతన యోగ విధానమును గూర్చి మరి కొంత యేదైనా వ్రాద్దామనే ఉబలాటాన్ని నేను ప్రయత్నపూర్వకంగా అణచు కొంటున్నాను; ఎందుకంటే ఈయోగం అతీశ కాయ కల్ప సిద్ధిని, ఐహిక అమృతత్వాన్ని, పరిపూర్ణప్రజ్ఞను ప్రసాదించడమే లక్ష్యంగా కలదని యెరుగుదుము గాని అంతకన్నా అధికంగా మాకెవ్వరికీ తెలిసినవిషయం కాదు. అంతేకాక ఈ నవ్య యోగ మార్గ ప్రవర్తకులు కూడా సంపూర్ణావగాహన లేనిదే దీనిని గూర్చి ఏమీ వ్రాయవలదని ఆదేశించారుప కూడా! ఆ మార్గాన సాగుతున్న సాధనకన్నా మించిన అభివ్యక్తి అవిషయమై మరొకటి ఉండబోదు

చివరగా ఇక్కడ శాస్త్రిగారి సహధర్మచారిణి జీవిత, భాగస్వామిని, అయిన మాతృశ్రీ మహాలక్ష్మి అమ్మగారికి కృతజ్ఞతా భక్తి పూర్వకమైన శ్రద్ధాంజలి నర్పించి నా ఋణమును తీర్చుకోవలసి యున్నాను.

రేయింబవళ్లు శ్రమించి ఆ యింటి నొక ఆశ్రమంగా చేరవచ్చిన విభిన్న ప్రకృతులు గల శిష్య గణాన్ని మాతృప్రేమతో ఆదరించి అన్నమిడి ఆదుకొని సలుబదియేండ్లకు పైగా శాస్త్రిగారికి సహధర్మచారిణియైన మాతృమూర్తి ఆ తల్లి. ఒడుదుడుకులైన ఎన్నో అనుభవాలను నిబ్బరంగా తట్టుకొని పతిదేవుని ఆధ్యాత్మిక సాధనకు అనేక విధాల ప్రశాంతంగా సహకరించిన దామె.

శాస్త్రిగారి పంచన చేరి ఆ మాతృమూర్తి ప్రేమాదరాలకు నోచుకొన్న వార మెందరమో ఆ తల్లికి తీర్చుకోలేనంతగా ఋణపడి యున్నాము. ఆమె తాను కన్నబిడ్డలకే కాక వారి యింట ప్రక్కిరిసిన అస్మదాదుల కెందరికో తల్లి.

తన పతిదేవుని ఆధ్యాత్మిక యోగానుభూతులలో ఆమె పాలుపంచుకొన్నది. అట్టి దివ్యానుభూతులలో ఆమె సహకారము అతిలోకమైనదని చెప్పదగును. ఆ పుణ్యజీవు లిద్దరూ ఈ యోగ విధానమున ప్రకృతి పురుషులవలెనే పరస్పరము సహకరించుకొనిరి.

సం॥ వెంకటేశ్వరరావు.

[ఫిబ్రవరి 1981 మణిమంజరి సంచికలో శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు తమ ప్రజ్ఞాప్రభాకరము ప్రవేశికకు అనుబంధముగా చేర్చిన ఆంగ్ల రచనకు తెలుగు సేత ఇది— సం॥]

# యోగమార్గ ప్రవేశానుగ్రహపత్రము

మాస్టర్ 64, తూర్పుడబీరు వీధి,
సి. వి. వి. కుంభకోణం.

ప్రవేశానుగ్రహకాలము : 16—4—17
9—45 *A.M.*

---

ప్రార్థన
మాస్టర్ సి. వి. వి.
నమస్కారము

నన్ను భృక్తరహిత తారకరాజయోగమార్గమున ఈజన్మలోనే బ్రహ్మమును తెలిసికొనేలాగున ఉద్ధరింప వేడుచున్నాను.

---

[సూచన] అడిగినప్పుడు దీనిని తిరిగి ఈయవలయును

... & Co., Madras - F. 1878-4-'17

[మాకడనున్న *Initiation Card* ఇది 1917 నాటిది. కాలమునుబట్టి ఇది మాతృశ్రీ మహాలక్ష్మమ్మగారి ఇనిసియేషన్ కార్డ్ అని తలచుచున్నాము. చూ. పుట 40 — సం॥]

# ప్రజ్ఞాప్రభాకరమునుగూర్చి

"శరీరమనే బ్రహ్మాండాన్ని పరిశోధించగా తేలిన పరమార్థమే ఈశ్వరుడు. ప్రపంచంలోని ఆనందాల చరమానందమే ఈశ్వరుడు. విశాల విశ్వాన్ని సంగ్రహించుకొని కుంచించుకొని పోగా మిగిలే పాయింటే—చరమాణవే—ఈశ్వరుడు".

అని పితృపాదులు శ్రీ ప్రభాకరులు తిరుపతిలో 1949, మే నెల 29 వ తేదీన జరిగిన పురప్రముఖుల సమావేశంలో ఉపదేశగర్భితమూ ఆత్మకథాత్మకమూ అయిన "ప్రజ్ఞాప్రభాకరము'' అనే గ్రంథానికి ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్ఘాటించారు.

ఆ సందర్భంలో తాము పొందిన యోగానుభూతిని గూర్చి వారు చేసిన ప్రసంగాని కిది సంగ్రహ రూపము. (చూ. ఆంధ్రప్రభ — దినపత్రిక, 1949 జూన్ 3 శుక్రవారం)

"నా 25వ ఏట భయంకర వ్యాధిగ్రస్తుడనైనాను. ఏ మందులకు మాకులకు ఆ వ్యాధి కుదరలేదు. తుదకు అప్పటి ప్రెసిడెన్సీ కాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసరు శ్రీ పోతరాజు నరసింహంగారి ద్వారా కుంభకోణంలో వున్న శ్రీ సి. వి. వెంకాసామిరావుగారనే మహామహుని 'ట్రీట్‌మెంట్' ద్వారా ఆరోగ్యాన్ని పొందాను. అప్పటి నుంచి ఆ మార్గమే ఉత్తమమైనదని విశ్వాసం కలిగింది. శరీరమనే పుస్తకాన్ని చదివే తీరును వారి నుంచే నేను ఉపదేశం పొందాను. అంతర్ముఖులమై ఈ శరీరమనే పుస్తకాన్ని అధ్యయనంచేస్తే మన ప్రజ్ఞ ఒక చోటుకు మోదుకొంటుంది. అదే కుండలిని. జడ కోలాటపు దారాలన్నీ ఒకే కేంద్రంనుంచి పాయలు పాయలుగా క్రిందికి వెళ్లుతున్నట్లుండే దేహంలోని శాఖోపశాఖలకు కేంద్రం

కుండలిని. అదే ఈశ్వరుడు. ఈశ్వరుడు మూత్ర పురీష కోశాల మధ్య మూలాధారంలో సృష్టికర్త రూపంగా వున్నాడంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఉదయం వేళలో దూరంగాఉన్న చెట్టు నీడ మధ్యాహ్నం 12 గంటలకు చెట్టులో లీనమైనట్టు ప్రపంచం భగవత్తాదాత్మ్యం పొందాలి. ఇలాటి దివ్యప్రజ్ఞ ప్రపంచానికి అందే కాలానికి జాతి మత వర్ణవిచక్షణ రూపుమాసిపోతుంది"

ప్రజ్ఞాప్రభాకరము మాస్టర్ యోగో పదేశాన్ని మాస్టర్ యోగానుభూతిని సాధకుని హృదయక్షేత్రంలో అక్షరరూపాన నిక్షేపించడాని కవతరించిన సాహిత్య సర్వస్వము.

"నన్నున్ వర్ణన సేయఁగా వలవ దన్నా! కన్నయందాఁక; మీఁ
ద న్నీవర్ణన మెందు; కిందులకుఁ గొందాఁక ప్రతీక్షింపు; మం
చు న్నన్గూర్చిన యుష్మదాజ్ఞకు నెదుర్చూపై గృహద్వారమం
దున్నాఁడం గనరాఁగదే కనుట కర్షన్ నన్నుఁ జేయంగదే" [వే. ప్ర]

అన్న తీరున ప్రభాకరులు ఆ "ఎదుర్చూపు"తోనే తమ ముప్పది యేండ్లకు పైపడిన యోగసాధన కాలంలో మాస్టర్ యోగాన్ని గూర్చి వ్రాయడం గాని, యోగోపదేశాన్ని ఇతరులకు చేయడంగాని తాము చేసియుండలేదు. 1948లో తమ షష్టిపూర్తినాడు శ్రీ ప్రభాకరులకు ప్రాతరుపాసన సమయమున గురుదేవుల యాజ్ఞ తెలియనయ్యెను. ''నన్ను గూర్చి వ్రాయగల యోగ్యత నీకు గలిగినది" అని శ్రీవారుద్బోధించిన విషయ మనుభూతికి వచ్చినది.

"వచ్చెను నేఁటి కర్వదగు వర్షము పుట్టువుఁదొట్టి, గర్భముం
జొచ్చుట దొట్టి నాకరయఁ జూచిన నేఁటికె షష్టిపూర్తి, యీ
వ్చన యేడు నిండిన ధ్రువంబుగఁ గాఁగల షష్టి పూర్తితో
నిచ్చట నాకుఁ గావలయు నిష్టికిఁ బూర్తియు సృష్టిపూర్తియున్"

అని విశద్ధముగా తలపోసి ప్రజ్ఞాప్రభాకర రచనకు వారు తొడగినారు.

"సీ.వీ.వీ కరుణా కటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్తిల్లెడు భక్తి యున్నయెడ నిత్యానంద మారోగ్యమా
హా పుట్టించెడు ప్రజ్ఞ యీ త్రయము లభ్యంబౌను; తార్కాణ నే
నే! వేయేటికి? మీఱ లిందఱును దీనిం జక్క గుర్తింపరో!''

అని సప్రమాణముగా వారి ప్రజ్ఞాప్రభాకరమున తమ అనుభూతి ఉపదేశమును సీ.వీ.వీ కరుణాకటాక్షమున సమన్వయించి చూపినారు. 'మీరలిందఱును దీనిం జక్క గుర్తింపరో' అని ఆదేశించినారు. గ్రంథరచనము 'నాడీగ్రంథము' అను ప్రకరణము వఱకును సాగినది.

అయ్యో! ఈ గ్రంథ మసమగ్రముగా నాగెను గదా అని పైపాటున చదువరికి తోచవచ్చును కాని 'దీనిం జక్కగుర్తించి' నపుడు గ్రంథ మసమగ్ర మగు ముగింపుకలది కాదనియు, సర్వసమగ్రమగు మాస్టర్ యోగ మార్గమున ప్రవేశార్హత (*Initiation*)ను ప్రత్యక్షముగా కల్పించు నీ "ప్రజ్ఞాప్రభాకరము'' సాధకుని హృదయమున గలుగవలసిన ప్రజ్ఞా సమున్మేషమునకొక యుపక్రమము మాత్రమే అనియు తెలియుచున్నది.

మాస్టర్ యోగ మిది యొక నూతన ప్రయోగము. పరబ్రహ్మాంశ రూపు లగు మాస్టర్ సీ.వీ.వీ ఈ యుగమున ఈ రాజయోగము నుపదేశించిరి. వారి వాక్కు స్వతః ప్రమాణమై, వారి సాధనానుభూతి యోగమై, వారి యునికి లోక తారకమై నెగడినది. "సీ.వీ.వీ" అను శ్రీవారి నామాక్షర త్రిపుటియే సర్వ మంత్ర రాజమై విరాజిల్లినది. జరుగ వలసిన లోక కల్యాణమున కామంత్రమే ఆది మూలము. తార్కాణగా నిలచి సాధకులకు పథము నిర్దేశించి ఉపదేశమొసగుట కవతరించిన ప్రజ్ఞాప్రభాకరము తన్మూలము ననుసరించిన వ్యాఖ్యానము.

"నా మాటలు స్వతః ప్రమాణములుగాని పరతః ప్రమాణములు గావు."

"నేను సదా నీలో నుందును. నీకు కావలసిన సహాయమును నీలోనుండి జరపుచునే యుందును."—

"బండి నడచు చుండగానే రిపేరు సాగవలెను. బండి ఊడదీసి చేయుచో బండివాని జీవిక చెడును. అట్టిది నా యోగ మార్గము."—

'ఈ యోగమున నెవడుగాని ప్రత్యేకముగా కడతేర జాలడు. తాను, తన చుట్టు పట్టులవారు, తన యాప్తులు ననుక్రమమున ప్రేమ వ్యాపకమగు తీరు నను సరించి తాను తన చుట్టుపట్టులవారు, తన యాప్తులు ననుక్రమముగా లోకము నంతను ప్రేమించి లోకమునంతను గడతేర్చువాడు కావలె. తన ప్రేమ సర్వలోక వ్యాపకము కానంత వఱకు నెవ్వడుగాని కడతేరజాలడు. అఖండము, సర్వవ్యాప కమునగు తత్త్వమును బడయుటకు తాను నఖండుడు, సర్వవ్యాపకుడు కాక తప్పదు. దేశకుల జాతిమతాది పరిచ్ఛేదములతో వేఱుపడిపోయి సర్వ ప్రజ-తో సామరస్యము కుదుర్చుకో లేనివాడు సంసార బంధమున కొట్టుకాడ వలసిన వాడే!"

"మన పరిపూర్ణత భవిష్యత్తులో నున్నదిగాని భూతము కాలేదు. కనుక భూతమను పీఠికపై నెలకొని భవిష్యత్తున పరమార్థ మనుభవింప వలసి యున్నది."

"మానవ హృదయము నిర్దుష్టము కానంతవఱకు, మానవ వాక్కు సుపవి త్రము కానంత వఱకు, మానవ కార్యములు వినిర్మలములు కానంత వఱకు సృష్టి రహస్యము మానవత గుర్తుప కందనేరదు. ప్రయత్నములు సాగుచున్నవి."

"ప్రజ్ఞోద్బోధముల వెంటాడుచు బాహ్యశాస్త్రాది సాధనములను విడనాడ వలెను. కడకు ఆత్మానుభూతిలో నెలకొనుట యగును. మీరు చూడవలసినది యీ తాటాకులనాడి గాదు. శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడి. ఈ తాటాకుల నిక గట్టిపెట్టి ఇందుచూపు తత్పరతను యోగసాధనముల మీద చూపుడు."

"మఱ్ఱి చెట్టునకు ఎన్నాళ్ళకే దిక్కున నేశాఖ నది వెలయింప గలదో తెలియనట్లే లోకతంత్రమున, మఱి యీ యోగ తంత్రమున వికాసముండును."

"మన ప్రజ్ఞ పెరుగను పెరుగను ఈశ్వరునకు జేరువ కానుగాను సర్వ ప్రాణి సృష్టి రహస్యములను మానవుడు గుర్తింపగల్గవచ్చును. మానవత పెరుగను పెరుగను తద్హృదయమున నుండి ప్రజ్ఞోద్బోధములు పెరుగ గలవు."

"పది సంవత్సరములు విడువక నా యాదేశము చొప్పున యోగాభ్యాసము చేయవలెను. అన్ని వాంఛితములను నీవే నెఱవేర్చుకొన గల్గుదువు."

ఇది మాస్టర్ ఉపదేశము.

"గులాబి మొగ్గను గడుపున బెట్టుకొని దాని గ్రమ్ముకొని కఱకు నూగ తొడిమ చేకే తొలుత గానవచ్చినట్టుగా ఉపక్రమమున నిందు ప్రభాకర నామకుడ నగు నేనే కానవత్తును గాని నాలోని దివ్యతత్త్వపు బూవు వికాసము చెందిన పిదప నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వెలార్ప జొచ్చిన పిదప, దాని గొని యానందింప గోరువారికి నేను తత్త్వదర్శకుడనుగానే, యంగుళి గ్రాహ్యమగు తొడిమను గానుగాని యడుగున బడియుంటి కానవత్తును. అప్పుడది ప్రజ్ఞాచరిత్రమే కాని ప్రభాకర చరిత్రము గాదు. ప్రభాకర చరిత్రమయినను ఆ ప్రభాకరుడు తొల్లింటి నేను గాక వేఱొకడే"

ప్రజ్ఞాప్రభాకరమిది ఆ ప్రజ్ఞా చరిత్రమున కుపక్రమము. అంగుళీ గ్రాహ్యమగు తొడిమ "అడుగున బడియుండి" కానవగు ప్రజ్ఞోద్బోధము. దివ్యశరీర శాస్త్రమునకు గూర్చిన పీఠిక యోగానుభూతికి సజీవ వ్యాఖ్యానము. సాధకునకు మాస్టర్ యోగమార్గాను యాయికి అతీతకాయ కల్పసిద్ధిని గూర్చు ముఖ ద్వారము ప్రవేశాను గ్రహమును కల్పించు ప్రమాణ పత్రము.

ఇది సాధకుల యనుభూతి. ప్రజ్ఞాప్రభాకరమును భక్తితో చదివి ప్రార్థనకు గూర్చున్న వారిలో ఇనిసియేషన్ పొందిన మాస్టర్ యోగసాధకులకు గలుగు చైతన్య స్పందనము కలుగుటయే దీనికి తార్కాణము.

**— వేటూరి ఆనందమూర్తి**

# CVP's Test

*TEST*

Test on Prabhakara Sastry by C R. 23 6.1916; 9.17 A.M. Boring No. 2. Breathing No. 31. From 11.9.13 by planet Sukra in its ray during its breathing 41.

The figure appears in its own natural colour and with a little healthy constitution in erect sitting posture with smiling face. His penial gland is greenish and is marked by 2 diagnally passing yellow lines. It is often suppressed by a strong vapour emanating from Hithu portion with green mixed yellow tint and rose boredr with such a force as to cause sudden shaking to the penial gland and this occurs occassionally. A rainbow coloured light with a candle flame like light in the middle which is internally pierced by white sparks which eminate upwards to come from his para Nirvanic Centre. His Hithu is not yet formed. His whole skeleton is not yet condensed and is yet dim white in colour and flexible. Two sets of wasted nerves of sympathetic chains with fever ganglia at the neck portion unevenly distributed and the whole spinal nerves with such growths as to appear to be temporarily wasted from natural condition. The ganglia at mental and astral are also very unevenly distributed and very small in size. The Chief Centre of the nervous system at the Medulla has some of its spithelial cells at the motor generating centre, by the radiation of the above mentioned vapour from Hithu, has semi paralysed and displaced from their original position. Hence it has lost all sensory and motor control over the whole body which has more of sensory portion in actual work than of motor by the above wastage and has become very

sensible to all kinds of vibrations and when affected by any sort of mental anxiety of thought working, it upsets the whole system causing a melting at the chief nervous centre which causes a shaking throughout the main system producing temporary giddiness, semi unconscious state, fear and failure of auditory and optic nerves, and he loses all control of thought and becomes as if a new man during such hours which continued for a short period only but occurs very often.

It makes him unfit for any work and even for taking his meals and thus a feeling of apprehension prevails and he thinks his life is a burden is in a position not knowing how to act. By this nervous debility, heaviness at chest and hard breathing, improper circulation even in ordinary meals are caused. By the failure of the Motor nerves on the muscular walls of the stomach bile is produced in large quantity and constipation is caused.

Urine too will be uneven in quantity and number varying from a large number of even less than minimum. This affect will also cause pain and swelling in the seed nerves also causing much anxiety and unbearable condition. The interior of his spinal column is filled with yellow tinged semi liquid mucus.

This soul is an ordinary type of the first sort and has passed *1731 births and is* in the ladder acquiring gnana with Bhakti and though studied much in this birth and able to argue in bits in philosopy he has no practical knowledge of any theories nor does he like to go in for any. He was a prey to his present disease for the last three years which has grown up very gradually and he was seeking relief for his complaint at this stage being informed of the existence and curative power of this society he was advised to seek help since which only can give him remeady and with this idea he was brought up here. From this first idea, the

second thought extended that after being relieved from his ailments and seeing the result to request afterwards if there is any way for salvation. With this idea he joined the society and if he finds any relief even minutely, he will work with faith and will follow instructions.

The astral is obedient and promises to obey commands. About 1/8th Horse power is less at present to H.P. and the rate of vibrations is 50 per minute. Temperature of the body under normal conditions is 98 6 corresponding chillness in 79. He must be advised to continue practice for one month as per Master's personal instruction and after seeing the result to get advice either to continue practice or to undergo treatment. Let him be advised after he reaches his place to use conjee prepared with rice and green gram mixed with milk and sugar after taking early bath before 6 A.M. and thence to commence practice. At evenings if he finds it convenient to bath let him bath and do the practice. Let him try to avoid coffee and substitute Rao Conjee or any other drink for tiffin. Let him take more quantity of ghee and curd and milk food at night. About vegetables and other diets let him adhere according to his desire and taste.

---

[See page 77 line 11. True copy of the "Test" secured from our Yoga Records and sent by Dr. P. Seshagiri Rao-Ed.]



ప్రార్థనలో శ్రీ ప్రభాకరులు

*C. V. V.*

నమస్కారము

# ప్రజ్ఞాప్రభాకరము

శ్రీ నిరంతరానందనిశ్శ్రేయసార్థ
సాధకము, సర్వకిల్బిషబాధకము, స
మగ్రవిజ్ఞానదము, మహామహిమఘనము
శరణ మగు మాకు సద్గురుచరణయుగము.

## 1

## ఉపక్రమము

సత్యజ్ఞానానందాత్మకమగు పరతత్త్వము తత్ప్రతికూలగతితో అవివేక జీర్ణారణ్యమున జిక్కి చీకాకు పడుచున్న యనదను నన్ను త్రోవకు దెచ్చి కాపాడిన తీరును మిత్రగోష్ఠిలో విన్నవించుకొనుటకొఱకే నా యీ గ్రంథ రచన ప్రయత్నము. దీని రచనమున నాకు పురుషోత్తముఁడగు గాంధి స్వచరిత్ర రచనా విధానము దారిదివ్వె. గులాబి మొగ్గను గడుపునఁ బెట్టుకొని దాని గ్రమ్ముకొని కఱకు నూగు తొడిమ జేకే తొలుత గానవచ్చినట్టుగా ఉపక్రమమున నిందు ప్రభాకరనామకుఁడ నగు నేనే కానవత్తును గాని, నాలోని దివ్య తత్త్వపుఁ బూవు వికాసము చెందిన పిదప, నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వెలార్పఁ

జొచ్చిన పిదప, దాని గొని యానందింపఁ గోరువారికి నేను తత్ప్రదర్శకుడను గానే, యంగుళిగ్రాహ్య మగు తొడిమనుగానే యడుగునఁ బడి యుండి కానవత్తును. అప్పు డిది ప్రజ్ఞా చరిత్రమే కాని ప్రభాకర చరిత్రము గాదు. ప్రభాకర చరిత్ర మయినను ఆ ప్రభాకరుడు తొల్లింటి నేను గాక వేఱొకఁడే.

పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుం
దరము పదార్థయుక్త మగుతత్త్వమునే వెలయింపఁగావలెన్,
గురుచరణారవిందములకుం బ్రణమిల్లెద నట్టి నేర్మికై.



# 2

## జ న నా ది క ము

సర్వజిన్నామ ఘ బహుళైకాదశీ మంగళవారమున ఉదయాది 19 గడియలకు జ్యేష్ఠాచతుర్థ చరణమున—క్రీ. 1888 ఫిబ్రవరి 7 వ తేదిని—కృష్ణాతీరమున పెద కళ్ళేపల్లి గ్రామమున నేను జన్మించితిని. నా జాతకచక్రము జన్మకాల ఘటికాది వివేచనతో నా బాల్యమున మా నాయనగారు వ్రాసియుంచినది కలదు గాని—నేను దాని నెల్ల నిం దుదాహరింపవల దనుకొంటిని. జోస్యులకు దాని పరిశీలనపు టలజడి వలదని నా కోరిక.

మా యూరు పూర్వము వేదశాస్త్రాది విద్యావిదులగు విప్రులతో సర్వ వర్ణములవారితో విలసిల్లినది. నా పసితనమునాఁటికిఁ గూడ వేద శాస్త్ర సాహిత్య విశారదు లనేకులు మా గ్రామమం దుండిరి. శ్రీవత్స గోత్రు లగు వెలనాటి వైదిక బ్రాహ్మణుల వంశము నాది. శేషమ్మ మా తల్లిగారి పేరు. సుందరశాస్త్రి మా తండ్రిగారి పేరు. ఆ పుణ్యదంపతులకు నలువురు పుత్రులు, నలువురు కుమార్తెలును కలిగిరి. నేఁటికిని సోదరులము నల్వురము సుఖముగా నున్నాము. నాకు అక్కగారు అన్నగారు నిద్దఱగ్రజులు, తర్వాతివా రవరజులు. మా తల్లి పరమసాధ్వి.

మా తండ్రిగారు కొంత కొంతగా స్మార్త వైదిక జ్యోతిష శిల్ప సంస్కృత సాహిత్యముల నేర్చినవారు. ఆంధ్రమున మంచి సాహిత్యమును కొంచెము కవితా పరిజ్ఞానమును గలవారు. వైద్య విద్యా విశారదులు. పారంపర్యముగా పురోహితత జీవిక యయినను మా తండ్రిగారు ప్రధానజీవిక వైద్యముఁగా వర్ధిల్లిరి. మా తల్లి దండ్రులు పరస్పరము ప్రేమమయులు. వివాహమయిన తర్వాత వారెన్నడు భిన్నస్థలములలో నెక్కువ నాళ్లు వసించి యెఱుగరట !

దంపతులు గాఢానురక్తులగుచో, సత్సంకల్పులగుచో, రసభావానందమయు లగుచో తత్సంతానము చిరంజీవిత్వాది గుణగణ్యమై వెలయఁగల దని ఇటీవలి నా గట్టి యెఱుక. ఇందు కెన్నో తార్కాణ లెఱుగుదును.

మా తల్లిదండ్రుల ప్రగాఢానురాగము తత్సంతానమగు మాకింతదాఁక క్షేమారోగ్యాదికము ప్రసాదించినదని నా విశ్వాసము. మా తండ్రిగారెనుబది మూఁడేండ్లు నిరామయ దీర్ఘ జీవితము గడపిరి. వారి తండ్రిగారును నెనుబది మూఁడేండ్లు జీవించిరి. మా తాతగారవసానకాలమున కుమారుని బిలిచి "నాయనా! నీవును నావలె నెనుబదిమూడేండ్లు జీవించగల"వని మా తండ్రిగారి నాశీర్వదించిరట! పలుమారులు మా నాయనగారీ యాశీర్వాదమును జెప్పుకొనుచుండెడివారు. వారి యాశీర్వాదము మా తండ్రిగారియెడ ఫలించినది! మా తల్లిదండ్రులు సంపన్నులు కారు గాని సంపన్నులకంటె సుఖముగా జీవిక గడపినవారు. పుత్ర పౌత్రాదులతో మా యూర మా యిల్లు దోసతోటవలె నుండెడిది. మా యింట మానాయనగారు నూటింటిదాక జన్మోత్సవములు వారి కాలమున జరిపినట్లు లెక్కించుచుండెడివారు.



# 3

## బాల్యస్మృతులు

ఒకనాఁడు తోడిబాలురతో గోచికూడ లేక వీధిలో చింపిరి కాగితముల నేదో యేదో పిచ్చి చదువు చదువుకొనుచుండఁగా నన్నుఁ జూచి పుణ్యమూర్తి కొట్టరువు సుందరరామయ్య పంతులుగారు (వారు మా యూర నేఁబది యేండ్లకుఁ బైపడిన కాలము బడి పంతులుగా నెలకొని యూరి వారి కందఱకు ప్రాథమిక విద్య నేర్పిన సచ్చరిత్రులు.) నా చేయి పట్టుకొని ఇంటికి గొనివచ్చి మా మాతృశ్రీ నడిగి గోచి గొని తానే మొలత్రాటికి దాని దగిలించి బడికి గొని పోయి రెండు మూడు నాళ్ళలోనే అక్షరజ్ఞాన మలవరిచిరి. తర్వాత వారిచేతనే మా తండ్రిగారు నా కక్షరాభ్యాసము జరపించిరి. నన్ను వారిచేత నే నెఱుఁగుటకు ఇది నా తొలిగుర్తు

బడిలో నేదో చదువు సాగినది. అన్నింట నేనే మొనగాఁడను. లెక్కలు మాత్రము నిండుసున్న. తెలుఁగన్న వెఱ్ఱి తీపు. బడిలోని యుపాధ్యాయులు నాచే పద్యముల జదివించుచు సంతోషించుచుండెడివారు. సంగీతముతోఁడి చదువు నాఁటికి నేఁటికిని గూడ నాకుఁ గొఱుకఁబడని మెఱికి బియ్యమే! సంగీతము లేకున్నను సందర్భస్ఫూర్తి గలుగునట్లు పసినాట లెక్క కెక్కుడుగ పద్యములు నేను చదువఁ గల్గుట యుపాధ్యాయులకు ముచ్చట గొల్పెడిది. మా చుట్టుపట్టు గ్రామము లన్నింటికంటె మా యూరనే మా యింటనే సంస్కృతాంధ్ర నిఘంటువులు ధర్మశాస్త్రాది గ్రంథ సంచయము నధికముగా నుండెను. గ్రంథములకై యనేకులు మా యింటికి వచ్చెడివారు. అర్థ మయినంతవఱకు మా యింటఁ గల గ్రంథముల నెడతెగక నేను చదువుచుండెడివాఁడను. మా తండ్రిగారు తెలుఁగు మఱుఁగులు కొన్ని తెలియఁ జెప్పుచుండెడివారు. ఈ ముచ్చటలఁ బడి నేను ఇంగ్లీషు చదువు నిరాకరించితిని. సంస్కృతాంధ్రములగుచో స్వగ్రామముననే కొన్ని గంటలే చదువఁదగుట, ఇంగ్లీషుకు తల్లిదండ్రులను, సుఖ భోజనమును విడిచి పెద్దయూరు బందరు పోవలయుట, పదికొండు గంటలనుండి అయిదు గంటలదాఁక స్కూలుకు పోయి చదువవలయుట, ఊరిలోని మిత్రగోష్ఠిని విడువ

వలయుట దుఃఖకరములుగా నా కపుడు తోఁచినవి. నిర్బంధించి మా తల్లిదండ్రులు నన్ను గ్రామాంతరమునకుఁ బంపఁజాలరైరి. పుత్రవాత్సల్యమును, భోజనాది సౌకర్యములు గ్రామాంతరమున కల్గింపఁ గల ధనసంపత్తి లేమియు దానికిఁ గారణములు.

స్వగ్రామముననే బ్రహ్మణ్యులయిన మద్దూరి రామావధానులుగారి దగ్గఱ సంస్కృతము, నింట తెలుఁగు చదువ సాగితిని. పుణ్యమూర్తులు, ప్రాతస్స్మరణీయులు మద్దూరి రామావధానులుగారు మా తండ్రిగారు నాబాల్యమిత్రులు. సమవయస్కులు. బ్రాహ్మముహూర్తమున నిద్రలేచి సరిగా వేళకు సంధ్యావందనాగ్నిహోత్రాది ప్రాత రాహ్నికములు నిర్వర్తించుకొని ఒక గంటసేపు ఉంఛవృత్తి నెఱపి, తొమ్మిది గంట లగుసరి కింటికి వచ్చి, మాధ్యాహ్నికము నిర్వర్తించుకొని పది కొట్టక పూర్వమే సుఖముగా భోజనము చేసి, విశ్రాంతితో విద్యార్థులకు పాఠములు చెప్పుటతో శ్రీవారు సత్కాలక్షేపము జరుపుచుండిరి. పదిగంటలలోగా భోజనము కానిచో వారి కొంటికణత తలనొప్పి వచ్చును. వా రతి సుకుమారశరీరులు. వారిని గూర్చి మా తండ్రిగారిని గూర్చి నాఁడు మా యూరి వా రిట్లు వాకొనుచుండువారు. రామావధానులు గారికి తన కనారోగ్యము కలుగుట ఊరి కంతకు అనారోగ్యము కలుగుట — సుందరశాస్త్రిగారికి తన కుటుంబమున కనారోగ్యము కలుగుట యూరికంతకు ననారోగ్యము కలుగుట — అని. తమ, తమ కుటుంబపు టనారోగ్యములకు వీరు గజిబిజి పడునంతగా ఇతరుల యనారోగ్యముల గూర్చి వీరు గజిబిజి పడువారు కారనుట దీని తత్త్వము.

మా యింటి దగ్గఱనే సాలెవీధిలో సాలెవారు వారి గురువగు భావనఋషికి ఉత్సవము జరుపుచుండిరి. నా వయస్సప్పటికి ఎనిమిదో తొమ్మిదో ఉండును. సంజవేళ 7, 8 గంటలప్పుడు భోజనము చేసి అక్కడ జరుగుచున్న యుత్సవమును జూచుట కేగి యట్టట్టే నేను మైమఱచి నేల వ్రాలి పోయితిని. అక్కడివారు మైమరుపాటు కలుగుచుండుట నా వల్ల విని న న్నింటికి గొనివచ్చిరి కాఁబోలును ! ఎంతసేపయినదో ! మా తండ్రిగారు దగ్గఱ శివకవచము పారాయణ చేయుచుండగా మెలకువ వచ్చెను. నా కేమియు బాధ గోచరింపలేదు అంతే. అటుపై సాధారణముగా జాతర్లకు, దేవోత్సవములకు నే నంతగా వెళ్ళ నుత్సహింపకుండుటే జరుగుచు వచ్చినది. పై సందర్భమున నాకు మైమఱుపా టేల కలిగెనో

అప్పు డెవ్వరికిని నెఱుక కందలేదు. పెక్కేండ్లకుఁ దర్వాత నాకే ఆది తెలియ వచ్చినది. అర్హసందర్భమున దాని చెప్పుదును.

పదేండ్లవయసు రాక ముందే యిట్టిది మఱొక సంఘటన! మా యూర కలరా తీవ్రముగా వ్యాపించినది. ఊరిలో నీ దుర్వ్యాధి వ్యాప్తికి చింతించుచు గుమిగూడి సంభాషించు పలువురలో నేఁడు మాటాడినవారే రేపు దాని వాతఁబడుట, మరణించుట జరుగసాగెను. గ్రామస్థు లెన్నెన్నో తంటాలు పడిరి. గ్రామదేవత లకు ఇతర దేవతలకు మ్రొక్కుకొనిరి. వ్యాధి కొన్నాళ్ళకు తగ్గిపోయినది. తగ్గిన వెంటనే పెద్దయెత్తున నాయాదేవతలకు జాతరలు సాగించిరి. ఆ దేవతల యాకృ తులు, వారిని గూర్చిన పంబవారికథలు, జంతుబలులు నాకు చాల రోతను భీతిని గొల్పసాగినవి. దేవత లిట్టివారా! ఈ అర్చన లేమిటి! అని నేను పలుక సాగగా చుట్టుప్రక్కలవారు దేవతలు నాపై కోపగింతు రని ఊరికి చెఱుపు చేయుదురని మాటాడకు మని నాపై కోపగింపసాగిరి. ఆ జాతర తుదినాడు కొర్లంత యను పేరి దేవత కొకబండి గట్టి దానిమీఁద గసి గలలో పందిపిల్లల నైదింటిని గ్రుచ్చి అవి గిజగిజ కొట్టుకొనుచు మరణయాతన ననుభవించుచుండగా నూరేగించి యూరి బయట ఆయాదేవతల కంపకములు చేసిరి.

నాఁటి దుర్దర్శనము నేఁటికి కనుల గట్టినట్లు గానవచ్చుచున్నది. ఊరి వారు జాతర సరిగా సాగె నని సంతసింపసాగిరి. గొప్ప సంక్షోభముతో నేను దుఃఖింపసాగితిని. మరణమును గూర్చి, మరణానంతర స్థితినిగూర్చి, పుట్టుకను గూర్చి, పుట్టుకకు పూర్వస్థితిని గూర్చి, దేవతలను గూర్చి నిరంతర చింత నాకు రేగెను. పెద్దల నడుగజాల నైతిని. తోడి వయసువారికి నా గోడు తెలుపుట వ్యర్థ మయ్యెను. వీని యాథార్థ్యము తెలియవలెనని రాత్రులందు భగవంతునికి మ్రొక్కి కనులు మూసికొని సమాధానము ప్రతీక్షింపసాగితిని. కనులు మూసికొని చూడ సాగగా ఓమ చిమ చిమ్మ చీకటి నన్ను చుట్టుముట్టి మహాసముద్రమువలె గోచరింప సాగెను. దాని మధ్యభాగమున నే నున్నట్టు తెలియును. అనంతముగా నన్ను చుట్టు ముట్టి యున్నట్టి యా యంధకారము పొడుగుగా నున్నదా, చతురస్రముగా నున్నదా అని కూడ జూడ దొడగితిని. అది యేదో గోళాకారముగా నున్నట్టు తోచును. దాని నడుమ 'నేను ఉన్నాను, ఉన్నా' నన్న ప్రజ్ఞ మాత్రము మినుకు మినుకు మనుచు గజిబిజి పోటుతో దోచుచుండెను. ఎన్ని రాత్రులో యిట్లు నిద్ర

పట్టునంతదాక చూచుచునే యుంటిని. ఒకటే యంధకారము. భయంకరమయిన యీ యంధకారములో నే నున్నానన్న యెఱుక, మెలకువ మాత్రము ధైర్యచ్ఛాయను గొల్పసాగినది. అట్లు కనులు మూసికొని బైటకు జూచుచున్నట్లు చూచుటే కాని యప్పుడు నా దేహములోనికి జూచుకొనుట యన్నది నే నెఱుగను? అట్లు చూడలేదు. బైటి యంధకార గోళమున నుండి నా ప్రశ్నలకు సమాధానములు దొరకలేదు. నేను చచ్చిపోయితిని. తర్వాత! అనుకొనెడివాడను. అప్పుడీ చీకటిలో నేను లేను అని తోచెడిది. బ్రతికి ఉన్నాను అనుకొనెడివాడను. ధైర్యము తోచి మినుకు మినుకు మనుచు అణుమాత్రుడను ఉన్నాను—అని తోచెడిది. ఎంత తంటాలు పడినను ఇంతే. ఒకనాడు నాలో చర్చ. ఎందుకు పుట్టితిని ? చచ్చితిని గనుక. ఎందుకు చచ్చితిని? పుట్టితిని గనుక. చచ్చితిని సరే—మరల పుట్టకుండరాదా? పుట్టితిని సరే—చావకుండరాదా ? తోచదు. ఇట్లు మనోమథనము జరగగా చివరికి తేల్చుకొన్నాను. నా పుట్టుక నే నెఱుగను. నా చావును నే నెఱుగను. అంతా చీకటే. ఇప్పుడేదో నేను ఇట్టు మినుకు మినుకు మనుచున్నాను. ఇది ఆరిపోతే ఏమవుతుందో తెలియలేదు. వెల్తురెక్కడున్నది? నేనున్నానని మినుకు మినుకు మను అణుమాత్రపు వెల్తురే యున్నది. ఇది ప్రజ్వరిల్లరాదా? ఈ చింత హెచ్చయినది. జాతరలమీఁద రోత మఱీ హెచ్చినది.

ఆ కాలముననే అప్పటికి నాకు పదేండ్ల వయసుండునో, ఉండదో మాయూర శివరాత్ర్యుత్సవము గొప్పగా సాగును. మా చుట్టుపట్టుల యూళ్ళకెల్ల మాయూరు గొప్పశివ క్షేత్రము. అక్కడ నాగేశ్వరస్వామి యని శివలింగమున్నది. అమరావతివలె నదియు బ్రాచీన శివక్షేత్రము. ఎంత ప్రాచీన మయినను నది బౌద్ధమత వినాశ చిహ్నముగా వెలసినదేయని నా నమ్మకము. అక్కడ శివలింగమొక బౌద్ధస్తూపశిలయే యని యిటీవలి నా నిశ్చయము. అక్కడి దేవాలయమున అర్ధ ధర్మచక్రములు గల బౌద్ధస్తూప శిలలున్నవి. కంటకసేల(గంటసాల)స్తూప విధ్వంసనానంతర మక్కడి స్తూపశిలలు చుట్టుపట్టుల దేవాలయ నిర్మాణములకుపకరించినవి. గంటసాలస్తూపపు సూచీశిల యొకటి మంగి యువరాజు శాసన శిలగా మారినది. క్రీ.శ. 6,7 శతాబ్దములకే బౌద్ధస్తూపములు గొన్నియైనను విధ్వంసము చెందినవనదగును. మా యూరి శివలింగము జనమేజయ సర్పయాగ

స్థానమందు అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, మహానాగకుమారుల చేత సుప్రతిష్ఠిత దివ్యలింగమని పదుమూఁడవ శతాబ్దినాఁటి శాసనమున్నది.

ఒక శివరాత్రినాఁడు — జగజ్జ్యోతి వెలిగించువేళకుఁ జాల ముందుగానే నే నక్కడకు జేరితిని. కొన్ని మణుగుల నేతికుండులో గొప్ప జ్యోతి వెలిగించిరి. నేను తిరిగి వచ్చుటలో గోపుర ద్వారమున జనసమ్మర్దములో నలిగి పోయి క్రింద పడితిని. నామీది నుండియే జనము నన్ను ఓంపిరెగుడ్డను దొర్లించుకొనుచు నడిచి నట్లు నడవజొచ్చిరి. చచ్చితి ననుకొంటిని. ఊపిరాడదు. ఎట్లో నన్ను కాళ్ళతోనే దొర్లించుచు గోపుర ద్వారము వెలికిపో పడదన్నిరి. బయటకు వచ్చిన తర్వాత నెమ్మదిగా ఒంటరిపట్టుకు దొరలి చాల సేపు విశ్రాంతి గొన్నపై చక్కబడితిని. నాటినుండి గుళ్ళు గోపురములు జాతరలు నాకు దూరమయినవి.

మఱొకప్పుడు మాచుట్టుపట్టుల యూళ్ళ నెల్ల ఒకానొక యలజడి రేగినది. అది యిట్టిది-ఒకనాఁ డుదయమున నుండి సాయంకాలము దాఁక ఊరివా రెల్లరు ఊరివెలుపల వసించి అక్కడ వంటలు చేసికొని దేవతలకు నైవేద్యము చేసి భుజింపవలయును. ఇంటి వాకిటితలుపులమీద శ్రీ వైష్ణవనామ మంటించవలెను. మెడలో సొరకాయ పెంచిక కట్టుకోవలెను. అట్లు చేయకున్నచో మహానర్థము వచ్చును. ప్రతియింటివాకిటి తలుపులమీద నామములు వెలయించిరి. ఎక్కడివో యెండు సొరకాయ బిళ్లలు (అమ్మిరి గాబోలును) వచ్చినవి. జందెములకు, మెడ హారములకు, మొలత్రాళ్ళకు నందఱు వానిని కట్టుకొనిరి. ఊరివెలుపల వంటలకు పయన మగుచుండిరి. మానాయనగా రిందుకు ప్రతికూలురు—ఊరివెలుపల కంద ఱును వెళ్ళిన పిదప దొంగ లూరు దోచుకోగలరని, మునసబు కరణాలు దైవ భీతితోనే జాగ్రత్త వహింతు మని మాట యిచ్చిరి. కొంద ఱెవ్వరైన నూరు విడువ కున్నచో తర్వాత నేదేని యాదృచ్ఛికముగానే ఆయెను - గ్రామమున కీడు దాపరిల్లినచో దాని తాకిడి ఊరు విడువని వారిమీఁద పడగలదు. కాన మాఱు మాటాడక యూరువిడిచి వెళ్ళవలసినదే యని యందఱు తీర్మానించుకొనిరి. మేము మాత్రము యింట పులిహోర చేసికొని యది మూట గట్టుకొని ఊరివెలుపలకు వెళ్ళి అక్కడ దేవతకు దాని నివేదించి భుజించి యింత మజ్జిగ త్రాగి యింటికి రాదగు ననుకొంటిమి. నన్నందుకై కరివేపాకు తెచ్చి పెట్టు మనిరి. ఊరిలోని వారందఱు నాహారసామగ్రులతో నూరివెలుపలకు వెళ్లుచుండిరి. దొడ్డిలో కరివేప

చెట్టు గల బ్రాహ్మణుల యింటికి వెళ్ళి కరివేపాకు నడిగితిని. వారు నూరివెలుపలికి పయనమగుచుండిరి. 'కరివేపా కీయ వీలులేదు. మేము వెళ్లుచుంటి' మనిరి. నేను దొడ్డిలోనికి వెళ్ళి గోసికొని పోవుదు నంటిని. 'తలుపులు తాళములు వేసినాము. వల్లగా' దనిరి—దొడ్డివైపున వెళ్ళి కోసి కొందు నంటిని—వల్లగాదు పొమ్మని వారు వెళ్ళిపోయిరి. నేను దొడ్డివైపునకు వెళ్ళి చెట్టుకేసి చూచుచుంటిని. కొందఱు నన్ను జేరవచ్చిరి. కరివేపాకు కావలె నంటిని. ఎందు కనిరి ? ఈ దేవతకు ద్వారమున కరివేపమండ కట్టవలె నట ! అందుకు గావలెనంటిని, అంతే, నా కొక మండ గోసి యిచ్చిరి. తర్వాత ఒకరొకరే ఒక్కొక్కమండ చొప్పున విఱుచుకొని కొనిపోయి ద్వారతోరణముల కెక్కించిరి. చెట్టున ఒక ఆకేని మిగులలేదు. మరునాఁ డింటి వారు వచ్చి ఆ యుండగము నేను చేసినదని గుర్తించి నన్ను దండించినంత నిందించిరి. నే నబద్ధమాడినందుకు ఫల మనుభవించితిని.

దైవముపేర సంఘమున అల్లజడి పుట్టించుట సుకరమనీ, అది దిద్దు టంత సుకరము గాదనీ, సంఘము విద్యా విజ్ఞానవంతమై మొత్తముమీఁద వర్ధిల్లిననే గాని యిట్టి చెట్టలు దొలగింప సాధ్యము కాదనీ విన్నవించుటకే ఈ విషయముల నిక్కడ వ్రాసితిని. మతము, వైద్యము, జోస్యము, ధర్మము, ఆచారము ఇత్యాది సంప్రదాయ సంకేతములతో చెడుగు లెన్నెన్నో సంఘమున దిద్దఁ గుదరనివై మొద్దువారి కదల కున్నవి. వ్యాపించుచున్నవి. మూఢవిశ్వాసముతో వాని ననువర్తించులోక ముండుటచేఁ దత్ప్రచారకులు వానిని స్వయము విశ్వసింపక పోయినను వానివలని లాభముచే లోకమున పలుకుబడి సాగించుకొనుచున్నారు. కొందఱు సగ మెఱుకతో నన్నింటిని పాటించుచున్నారు.

ఇటీవల జరగిన విషయ మొకటి.

నా మిత్రున కొకనికి ముక్కులో పెద్దకురుపు లేచినది. అతని కాయుర్వేద వైద్యమునఁ గొంత నమ్మకము. మిత్రుఁ డొక ఆంగ్లవైద్యుఁడు దానిని ఆపరేషన్ చేసి సులువుగా దొలగింతు ననుచుండెను. వ్యాధితుఁడు పిరికివాఁడు. కూరగాయ దేశీయవైద్య మెఱిగినమిత్రుఁ డొకఁడు నఖమును అనగా చేతిగోటిని నువ్వుల నూనెతో గాచి గోర్వెచ్చగా ముక్కులో రెండు బొట్లు వేసిన నది మాను ననెను. తోడనే అతని తల దన్నిన మిత్రుడు ఇతరుల గోటికంటె తనగోరు కత్తిరించి

వేసికొనిననే మఱీ మంచిదనెను. నాకు వెఱ్ఱులు వేకులు నెత్తసాగినవి. ఇట్లంపని, 'అతఁ డాపన్నుఁడు గా నున్నాఁడు. అశాస్త్రీయముగా నెఱుక లేని మొఱకు పైద్యములఁ జెప్పకుఁడు.' 'నె నేందఱకో ఈ వైద్యముచే ముక్కులో కురుపులు మాన్పితిని. ఎఱుకలేని వైద్యము కా విది' యని తొలియాతఁ డనెను. రెండవయాతఁ 'డిదియశాస్త్రీయము గాదు. కొన్ని వ్యాధులకు తన శరీరములోని రక్తమునే ఒక చోట నుండి మఱొకచోట ఇంజెక్షన్ చేసి వ్యాధులు కుదుర్చుటను ఆంగ్లేయులు గుర్తించిరి కాదా! ఇది ఎంతో పూర్వమే మన వారు కనిపెట్టి సాగించిన విధానము. నేను నాకే కురుపు లేవగా నా చేతిగోరే వేసి కాచిన నూనెతో కురుపు మాన్పి కొంటిని' అని నన్ను మాటాడకుండఁ జేసెను. నాలో ఇంతంతనరాని యశాంతి. ఇది బూటక మని. ఇది చేసిన రోగి చెడిపోక పోయినను గుణము కల్గక పోవచ్చు నని యారాటపడసాగితిని. మద్రాసులో ఉన్ననాళ్ళవి. ఓరియంటల్ లైబ్రరికీ వెళ్ళి 'నఖము' గుణములకై వెదకితిని. అక్కడ ఆయుర్వేద వైద్యశాలలో పనిచేయుచున్న మిత్రున కిది తెల్పితిని. 'నఖ' మనఁగా చేతిగోరు కా దనీ, అది సుగంధద్రవ్యమనీ, నత్తగుల్లలవంటి జలజంతువుల గుల్లల మూతచిప్పయనీ యా మిత్రుఁడు తెల్పెను. గ్రంథములఁ బరికించి దాని యాథార్థ్యమును గుర్తించితిని. వెంటనే రోగికి దాని నెఱిఁగించి మంచి వైద్యము చేయించుకో గోరితిని. తర్వాత ఆపరేషన్ జరగెను. ఆతఁడు స్వాస్థ్యము చెందెను.

అంతరంగమున విస్పష్టపరిజ్ఞానపుతీరు గోచరింపని వారు చేయు సాహస కార్యము లిట్టివి! ఎఱుక కందని వ్యాధిత శరీరమున యెఱుక కందనియౌషధ మును జాలినంత యెఱుక లేనివారు ప్రయోగించుట, ఏదో జరుగుచుండుటయుఁ గా వైద్యవిధాన మున్నది. అంతరంగమును ప్రీల్చుకొని యంతరాత్మాభిముఖముగా బయనించుచు సత్యజ్ఞానానందముల నంతలంతల ననుభవింప నలవడినవారి ప్రజ్ఞలే ప్రపంచోప కారకము లగుచుండును.

ఇంచుమించుగా నా పదియేండ్ల ప్రాయముననే నాకడగొట్టుసోదరికిఁ జాల జబ్బు చేసినది. జీవితము నిలువదేమోయని యందఱు సందేహించు స్థితి కలిగెను. తర్వాతస్థితి యెట్లుండునో యని మాకు చల్దియన్నము వడివడిగాఁ బెట్టిరి. మాతో వావిడిచి చెప్పకున్నను ఇంటిలోని యలజడిని గుర్తించి నేను బెంగతో నెవ్వరికిని గానరాకుండ గుడిలోని కరిగి యక్కడ నొకమూలలో రక్షించు మని యా బిడ్డను

గూర్చి భగవంతునిగూర్చి యేమేమో ధ్యానింపఁజొచ్చితిని. ఇంతలో మధ్యాహ్నపుఁ దిండికి రాలేదు. ఇంటిలో అలజడి కొంత తగ్గినది. రెండు మూఁడు విరేచనములయి బిడ్డ తేటగా నున్నది. అపాయభయము తొలఁగినది. అందఱును భోజనము చేసి నేను గానరాకపోవుట గుర్తించి వెదకసాగిరి. మిత్రులిండ్లలో నెక్కడను నేనుగానరా లేదు. ప్రొద్దు గ్రుంకువేళ కావచ్చినది. మా నాయనగారికి వెఱపు కల్గినది. వెదకఁగా వెదకఁగా తుదికి గుడిలో నక్కియున్న నన్ను గనుగొని బిడ్డ క్షేమ మెఱిఁగించి చాల దుఃఖించి నన్నింటికిఁ గొనివచ్చిరి. పసితనము నాఁటినుండియు వ్యాధికి మృతికి నేను తాల్మారయి పోయెడి వాఁడను. ఏమియు తోచక చేయఁ గల్గినది లేక ఇంట నిలుకలేక ఎవ్వరును గుర్తింపఁజాల రని గుడిలో నొక మూల నక్కి నాఁడు నేను దైవప్రార్థనము చేసితినే కాని దానికి ఫలితముండు నని యా నాఁడు నే నెఱుఁగను.

మా నాయనగారు వైద్యవృత్తిలో రోగులకడ కటువుగా సొమ్ము పుచ్చుకొనుచుండిరి. ఒక సందర్భమున వ్యాధితుని యార్తికిఁ జకితుఁడ నయిన నేను మా నాయనగారిని సొమ్ముకై నిర్బంధింపక మం దీయఁగోరితిని. 'ముందు వ్యాధికుదుర్చుఁడు. వానిచేత సొమ్మిపుడు లేదు. నెమ్మదిగా ఇయ్యఁగలఁడు. ఇయ్యకపోయినఁ బోనిండు. మీకు పుణ్యము దక్కు' నంటిని. రెండు నిమిషము లాలోచించి 'నాయనా ! ఈ కాఠిన్యము మీ మీఁది ప్రేమచేతనే నేను పూనవలసెను. నే నిట్టి కాఠిన్యము పూనకున్న సొమ్ము రాదు. అది యార్జించినఁ గాని మీ పోష ణము సాగదు. మీమీఁది ప్రేమ నన్నితరులమీఁద నింత కఠినునిఁ గావించినది' అనిరి. కనుల నీరు గ్రుక్కుకొని యూరకుంటిని. ఆ సంభాషణము నాలో మఱపురాక కుదుర్కొని నాఁటినుండి నన్ను వేధింపఁజొచ్చినది. దానినిర్వాహము ముందు తెలియఁగలదు.



# 4

## పురోహితత - సదనుష్ఠానము

పురోహితవృత్తి నాకు మిక్కిలిరోఁత గొల్పినది. అది శాస్త్రగర్హితమన్న కారణమునఁ గాదు. ప్రాచీన ధర్మశాస్త్ర ప్రకారము చూచినచో నేఁడు బ్రాహ్మణు లవలంబించుచున్న వృత్తు లనేకములు శాస్త్రగర్హితములే! భృతకోపాధ్యాయత్వము, వైద్యము, గాయకత్వము, వడ్డివ్యాపారము మొదలయిన యింక నెన్నో యింత కంటె నీచము లగువృత్తులు ధనలబ్ధికై బ్రాహ్మణులు చేయుచున్నారు. అయినను అవి నిందితములు గాకున్నవి. అట్టిచో నిక బ్రాహ్మణులే చేయవలసినవి పూజరితనము, పురోహితత గర్హితము లేల కావలెను? సంఘమున కావశ్యకమైన కులవృత్తి యేది గాని గర్హితము గారాదు. అయినను పూర్వులెల్లరు నవలంబించినదైనను పురోహితత నాకు సమ్మతము కాలేదు. అది నేఁడు వట్టిబూటకముగా సాగుచున్నది. నూటఁ దొంబదిపాళ్ళు పురోహితులను గోరువారు వారియం దాదరము గౌరవము లేనివారు. వా రేదో యలవాటును బాటించుచున్నా మన్న తృప్తికై కర్మలాచరించు చున్నారే కాని పరమార్థబుద్ధితోఁగాదు.

ఆ యాచరించుకర్మలును ప్రయోజనమును, స్వరూపమును సన్న సన్నగాఁ గోల్పోవుచు వచ్చి యర్థరహితములైన బాహ్యాడంబరములుగాఁ బర్యవసించినవి. నిజముగా వాని యెడ శ్రద్ధగలవారు స్వయము వాని నభ్యసించి నిర్వర్తించుకో గలరు. అట్టివారు స్వయము పరమార్థబుద్ధితో నాచరించుచుండువారినే పురోహితులనుగా వరింపఁగలరు. పురోహితత వంశాచారముగా వచ్చుచుండుటచేనం దెన్నో భ్రంశములు చేరినవి. బ్రాహ్మణులలో వేయింటి కొక్కరయినను సరిగా నగ్నిహోత్రముల నుంచుకొనువారు నేఁడు లేరు. శ్రౌతసంప్రదాయమే యుత్సన్నప్రాయ మైనది. ఉపనయనమునాఁడు, వివాహమునాఁడు మాత్రము చేయునగ్ని కార్యము, దానిని సరిగాఁ జేయనందుకుఁ బ్రాయశ్చిత్తములు, హోమములు పురోహితుని వింత

పాటలు నాటలు నయిపోయినవి. కాళిదాసు నాటకములందు విదూషకుఁ డెట్టి పూజ్యత బొందినాఁడో నేఁడు వివాహోపనయనాది కర్మలందు పురోహితుఁడు నట్టి పూజ్యతనే పొందుచున్నాఁడు. "అశ్రద్ధ పితాళ్ళకు ఆకతాయి తర్పణ" మన్నట్లు అశ్రద్ధ ధానుఁ డయినగృహస్థుకుఁ దగినట్టే యవాకుల పురోహితు లేర్పడినారు. కనుక నీయవహేళిత వృత్తిలో ప్రవర్తింప రాదని, సంభావనలకు, భిక్షములకు నేనిది నేర్చితి నది నేర్చితి నని యాచనలకుఁబోరాదని పసినాఁటనే నేను నిర్ణయించుకొంటిని.

నా కుపనయన మయినది. సంధ్యావందనాదికము నిర్దుష్టముగా నేర్చుకొంటిని, సంధ్యాభాష్యము చదివి యర్థము తెలిసికొంటిని. ఇంటిదగ్గఱనున్నచో నిక వైదిక వృత్తికిఁ జొరపడవలసి వచ్చెడిదేమోకాని ఈశ్వరుఁ డనుగ్రహించెను. చల్లపల్లి విద్వాంసులు, మహర్షి కల్పులు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రులుగా రప్పుడప్పుడు మా గ్రామమునకు విచ్చేయు చుండువారు. ఎడ్వర్డు పట్టాభిషేకము జరగినపుడు నేనేవో సంస్కృత శ్లోకములు రచించితిని. వారు విచ్చేసి నా రచన విని నన్నుఁ బ్రేమించిరి. వారు విజయనగరమున భీమాచార్యులుగా రను తర్క విద్వాంసులకడ సంగమేశ్వర శాస్త్రిగారితోఁ గలసి పెక్కేండ్లు తర్క శాస్త్రము నభ్యసించి తొలుత మా గ్రామమున నెలకొనఁగా నేదో తీవ్రానారోగ్యము కలుగఁగా మా నాయనగారు వారి కౌషధ మిచ్చి వ్యాధి కుదిర్చి రఁట! తరువాత వారు చల్లపల్లి చేరిరి. ఆ యనుబంధమున వారు మా యింటికి విచ్చేయుచుండువారు. వారిదగ్గఱఁ జదువు కొనుటకు నేను చల్లపల్లి చేరితిని. లఘుకౌముది చదువ నారంభించితిని. కాని వారు పాతంజల యోగ సూత్రములను గూడఁ జెప్పిరి. అందుఁ జదివిన విషయములు నాలోఁ జొచ్చుకొని పోయి వింత యోచనలఁ గొల్ప సాగినవి. వారు తెల్లవారు జామున నిద్రలేచి రాత్రి పండ్రెండు గంటలదాఁక సనుష్ఠానముతో తపోమయులుగా విరాజిల్లు చుండెడివారు. విద్యార్థుల మగుమమ్ము గూడనట్లు చక్కదిద్దఁ జూచు చుండెడివారు. కర్మానుష్ఠానముల మీఁద నా కేటికో శ్రద్ధ కలుగకపోయెను. బందరులో శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుగారు హిందూ హైస్కూలులో తెలుఁగు పండితులుగా నున్న [illegible].

ఇంటివాకిటఁ గూర్చుండి నేను పాఠము చదువుకొనుచుంటిని. లోపల ఇల్లూడ్చుట జరుగుచుండెను. ఆ దుమ్ము వాకిటికి వచ్చుచు నా మీఁదను సోకుచున్నది. 'సమ్మార్జనీ రజశ్చైవ శక్రస్యాపి శ్రియం హరేత్' అని కలదు. ఇక్కడే కూర్చుంటి వేమి యనిరి. చూడలేదు అంటిని. 'అది కాదు, శాస్త్రవిశ్వాసము లేదు' అనిరి. ఊరకుంటిని. వారవతలికి వెళ్ళిన తర్వాత 'దుమ్ము మీఁదఁ బడుట రోఁతే! నేను పుస్తకముమీఁది దృష్టితో ఉండి గుర్తింపఁజాల నయితిని. గురువులవారన్నట్టు నిజముగా నిట్టి శాస్త్రముమీఁద విశ్వాసము నాకు లేనట్టే ఉన్నది' అని యేదో ప్రక్కనున్న మిత్రునితో ననుచుంటిని. అది విని శాస్త్రిలవారు నన్ను చీవాట్లు పెట్టిరి.



# 5

## అనుభూతి - తద్వికాసము

ఏదో సందర్భములో నా పసి (అయిదు ఎనిమిది సంవత్సరముల నడిమి) వయస్సుననే ఆంజనేయుని దేవళమున బ్రాహ్మణ సంతర్పణము జరుగుచున్నది. నేను నున్నాను. బీటలు వాసి శిథిలముగా నున్న గుడి తలుపుసందున నుండి యెవరో తొంగిచూచిరి. ఆరగించనున్న లోనివా రవి గుర్తించి గద్దించిరి. బైటి మనిషి వైదొలగెను. మే మందఱము భుజించి వెలికివచ్చితిమి. సాధు వొకఁ డాకొని యక్కడుండెను. 'నీవే కదా తొంగిచూచిన'దని భుక్తానులిప్తులగు మావా రడిగిరి, 'అగునండి! లోని సందడి విని గుడి కదా! లోని కలకలమేమో అని చూచితిని. భుజించుట చూచితిని. మీరు గద్దించితిరి మీ భోజనానంతర మాకొన్న వానికి నాకింత యన్నము పెట్టుదు రేమో అని కూర్చుంటిని' అనెను. 'బ్రాహ్మణ సంతర్పణము చెడగొట్టితివిరా దుర్మార్గుఁడా' యని మా వారు చెడదిట్టిరి. 'అయ్యా! మీరింత యన్నము పెట్టిన నా కడుపు నిండునుగాని మీ భోజనము చూచినంత మాత్రమున నాకేమి యెులుకునండీ! లోన భుజించుట యెఱుఁగక చూచితిని' అనెను. 'ఇంకా భుజింపవలసిన బ్రాహ్మణు లున్నారు. అంతా ముగిసేదాకా నీకు పెట్ట వీలులేదు, పో! తొలగిపొ'మ్మని ఒక మొనగాడు బ్రాహ్మణుఁ డుదరము నులుముకొనుచుఁ దిట్టెను. మిట్టమధ్యాహ్నము పన్నెండు గంటలవేళ! ఆ సాధువు కన్నీరు కార్చుచు ఆకసముకేసిచూచి తలవాల్చి కేలుదోయి సూర్యభగవానునికి మోడ్చి 'తండ్రీ! నే నేపాపము నెఱుఁగను. నన్ను వీరు తిట్టుచున్నారు. సర్వ సాక్షివి! చూచుచున్నావు! కనికరించు మో దేవా!' అని చేతి కుండికలోని నీటితో బిక్క మొగము కడుగుకొని యక్కడనుండి వెడలిపోయెను. ఆ సాధు వట్లు సూర్యునికి మ్రొక్కుచు మండుటెండలో మాడుచు నాడినపలుకులు నా గుండెలలో వేడిగా నాఁటుకొనెను. ఒడలు జలదరించెను. ఇంటికి వెళ్లునప్పటికి తీవ్రజ్వరము వచ్చెను. మూఁడునాళ్లు చాల బాధపడితిని. ఆ బ్రాహ్మణుని ధౌర్త్యము, ఆ సాధువు జాలిమాటలు నాలో నా మూఁడు నాళ్ల నెంతో గందరగోళము గల్గించినవి. మా తలిదండ్రుల కీగొడవ నేను తెలుపలేదు. క్రమక్రమముగా నా జ్వరము తగ్గినది.

ఆ మూఁడునాళ్ళ శరీరకంపములో నాలో నెంతో లోతున నేదో భావము పాతుకొని పోయినది. ఈ సంభవము మాత్రము నాకు పలుతూరులు స్మృతిపథమున మెలగు చునే యుండినది. కాని అది లోఁ బాదుకొనిపోయి నాలోనుండి వెడలించిన వివేక జ్వాలలను మాత్రము నేనిటీవలనే — ఈ విషయము వ్రాయుచున్నప్పుడే — స్పష్టముగా నిరూఢముగా నెఱుఁగగల్గితిని.

పంద్రెండేండ్లకు ముందు మా మాతృశ్రీ దివ్యధామ మందగా ఔర్ధ్వ దైహిక కర్మకలాపము మా యన్నగారు చేసిరి. నేను తద్దినము పెట్టువాని తమ్ముఁడనుగా దగ్గఱ నుంటిని. "జ్యేష్ఠేనైవతు కర్తవ్యం" అను శాస్త్రనిర్ణయము చొప్పునే నేను పాటించితిని. వచ్చిన వైదిక బృందము నేను కర్మ కలాపములు చేయ కూరకుంటి నని గర్హింపసాగిరి. శాస్త్ర నిర్ణయమును మా యింటి ప్రక్కనే ఉన్న సాంబశివశాస్త్రిగా రను విద్వాంసులు నిరూపించి యా వైదికగోష్ఠిని నోరెత్తకుండఁ జేసిరి. అప్పుడు కర్మకలాప మంతయు ముగిసిన తర్వాత అన్నాతురులగు ప్రజలకు వర్ణవిభేదము లేకుండ ఒక నాఁ డెల్ల నేడెనిమిది వందలమందికి సంతర్పణము గావించితిమి. సంకల్పము నాది గాని నిర్వాహ మెల్ల మా తమ్ములు చేసిరి. వీధి యెల్ల శుభ్రపఱచి విస్తళ్లు వేసి భోజనములు పెట్టితిమి. కొందఱు వీధి యెల్ల చండాల భోజనముతో నంటైనదని గర్హించిరి. చుట్టుపట్టుల యూళ్ళ నలజడి రేగెను. మా నిర్ణయము నిర్విఘ్నముగా సాగెను. ఇట్టి సంకల్పము నాలో పొడముట నా బాల్యమున నాలోఁ గుదుర్కొన్న యవ్యక్త భావ కారణమున నుండి వెడలిన కార్యవికాసమే యగుట నిటీవల గుర్తించితిని.

మరియు ముత్యాలలో జరిగిన నా కుమారుని వివాహమున గూడ నక్కడి సర్వజాతుల వారికిని, పాకీ వారికి గూడ ఒక్కొక్కనాఁ డొక్కొక్క జాతివారికిఁ గా మృష్టాన్నసంతర్పణము జరుపు టయ్యెను. ఈ సందర్భమునఁ గూడ మా తమ్ములే నిర్వాహకులు. ఆ వివాహ సందర్భములో మా కాప్తమిత్రులు, శ్రీ ముక్త్యాల ప్రభువులు తమ యింటి వివాహముగా వివాహసర్వవ్యయము ఎన్ని వేలయ్యెనో తామే భరించిరి. ఇట్లు జరగుటకు గూడ బాల్యమున నాలోఁ గుదు ర్కొన్న యవ్యక్తభావమే కారణము.

భూమిలోఁ బడవేసిన విత్తనము కొంతదాఁక ఏమయినదియుఁ దెలియరాక యుండి యుచితకాలమున నంకుర రూపముగా బహిర్వికాసము చెందినట్లు మానవ హృదయములలోఁ జొచ్చు కొనిపోయిన యనుభూతులు కూడ నుచిత కాలమున వానికిఁ దగినట్లు పాకముతో వెల్వడి విరివి నెందును. కాని యివి బీజరూపముగా నెన్నడో లోనికిఁ జొచ్చుకొని పోయిన యా యనుభూతులవల్ల నేర్పడినవే యని గుర్తించుట మాత్రము సర్వత్ర జరుగదు. లోతయిన సంస్కారములు కొన్ని కాల మెంతో గడచి యనుకూలసందర్భము సమకూడినప్పుడు గాని కార్య పరిణామము నెందఁజాలవు. ఆ చెందిన కార్యపరిణామమునాఁటికి కారణజ్ఞప్తి మఱుగుపడి పోవుట సంభవింపవచ్చును. ఈ బీజరూప సంస్కారములు లో నొచ్చుటయుఁ దర్వాత నవి బహిర్వికాసము నెందుటయు నొక్కజన్మములోనే జరుగు ననఁగాదు. పూర్వక్షణపు బీజ రూపసంస్కార ముత్తరక్షణముననే బహి ర్వికాసము చెందునది గాఁ గొన్ని సందర్భములం దుండవచ్చును, కొన్ని సంద ర్భములం దేడుజన్మముల దాఁకఁగూడఁ దేలనిది గావచ్చును. భగవత్ప్రాప్త్యర్థమైన సంకల్పబీజములు భగవత్తత్త్వమును గూర్చి స్పష్టపరిజ్ఞానము కుదురుదాఁక విరివి నెందుచుఁ బెరిగి పెరిగి పారమ్యము పొందిన పిదప నక్కడనుండి బహిర్వికాసము నకు వచ్చుచుఁ బరిపూర్ణతను జెందుటకుఁ గూడ నట్లే యేడు జన్మములదాఁక సాగ వచ్చును.

పరిపూర్ణత చెందు టనఁగా మానవసామాన్యము కంటె నెంతో ఉన్నతో న్నతముగా ఎంతో లోతులోతుగా గోచరించిన తత్త్వమును మానవుఁడు తన ప్రేమ ప్రసరించిన చోట్ల నెల్ల వ్యాప్తపఱుపఁగల్గుట. ఉన్నతోన్నతము, లోతు లోతు నయినభావ మదాటుగా అకారణముగా అసాధనముగా గోచరింపదు. తన హృదయ మెంతెంత ప్రేమమయమగునో, ఆ ప్రేమ మానవతమీఁద నెంతెంత యధికాధికముగాఁ బ్రసరించునో మానవుఁ డంతంత ఉన్నతముగా అంతంత లోతుగా పారమ్యమునకుఁ జేరిక చేరికగాఁ బోగల్గును. చెట్లవేళ్లు విరివి నెంది దూరదూరము వ్యాపింపను వ్యాపింపను చెట్లు మీఁదికి పెరుగగల్గును. కూకటి వేరు నేల్లోఁతుకును జొరఁగల్గును గదా !

# 6

## కాకి పగ

పది పదుమూఁడేండ్ల వయసువాఁడను. అప్పటికి చల్లపల్లిలోఁ జదువు కొనుటకు వెళ్ళియుందు ననుకొందును. నాకు చింతచిగురు పప్పుకూర యన్నఁ బ్రియము. మా యింటి దొడ్డిలోనున్న చింతచెట్టు గుబురుగాఁ జిగిర్చి యగ్ని జ్వాలలు రేగుచున్నట్లు మిలమిల చిగుళ్ళతో మెఱయుచుండెను. 'ఆ చిగురుకోసి తెత్తును, కూరవండిపెట్టు' మని మాయమ్మగారిని కోరితిని. గోడమీఁద నెక్కి చిగురు కోయుచు చేతి కందని కొమ్మ నొక కొంకికఱ్ఱతో వంగ లాగఁజొచ్చితిని. ఆ కొమ్మ ప్రక్కలఁ గాకిగూ డున్నది కాబోలును! నాకుఁ గానరాలేదు. ఒకకాకి యఱచుచు నినుపమేకుతోఁ గొట్టినట్టు నా నెత్తి మీఁద ముక్కుతోఁ గొట్టెను. ఇంకను గొట్టుచు కావు కావని యఱచుచు ఇంక నెన్నింటినో కాకుల రప్పించు కొనెను. ఒకటే గగ్గోలు! కంగారుపడి గోడ దిగి యింటిలోనికి వచ్చి వేసితిని. మర్నాడే నేను చల్లపల్లి వెళ్ళిపోయితిని.

తదాది నే నెప్పు డింటికి వచ్చినను నీకాకి పగ ప్రత్యక్ష మయ్యెడిది. మఱచి దొడ్డిలోనికి వెళ్ళితినా కాకి ముక్కుతో నా తలమీఁదఁ గొట్టిన దన్నమాటే! భోజనము చేసి చేయి కడుగుకొనుచో నా నెత్తిమీఁద నా కాకి రెట్టవేయుటయు ముక్కుతో పొడుచుటయు జరిగెడివి. కొన్ని సమయములలో తలమీఁది యా రోఁతకు మరల స్నానము చేయవలయుచుండును. ఈ కాకిపగ నన్నుఁ బది పదిహేనేండ్లు బాధించినది. ఎఱిఁగి నే నేమియు నా కాకికి అపకృతి చేయలేదు. దాని గూటికిని గూడ నెట్టికీడును జరుగలేదు. కాని దానిపగ మాత్రము నాపై ప్రబలముగా బహువత్సరములు సాగినది. మద్రాసు వచ్చిన తర్వాత నెలనెలకు నే నింటికిఁ బోవుటయుఁ దప్పెను. ఆ చింత చెట్టు నెండిపోయెను. వత్సరమునకో వత్సరములకో నే నింటికి వెళ్లుచుండినను నా కా కాకి బాధ మఱి కలుగక పోయెను. ఆ కాకికూడ వేఖుచోటికిఁ జేరెనో! ఏమయ్యెనో! ఈ కథ నెందు కిక్కడ వ్రాసితి

ననఁగా నిది నాకుఁ జాల వివేకము గఱపి బహుల సమయములలో భావ వీథిలో విహరించుచుండిన యథార్థ గాథ!

ఇటీవల బసవపురాణాది గ్రంథముల ముద్రణ సందర్భములందు నాపై తీవ్రముగాఁ గోపము ప్రకటించి యిప్పటికిఁ బ్రకటించుచున్న వారియెడ నేనువర్తింప వలసిన తీరును కాకి పగ నాకు పాఠము చెప్పినది. ఎంత తీవ్రముగా విరోధించిన వారిపయినయినను బ్రతివిరోధము పాటింపక, యంతరంగమున నాత్మీయతనే పాటించుచు ననురాగమునే సాగించుచుఁ దెలియఁ జెప్పఁదగినదానిని (కొందఱే అట్లు చెప్పదగిన వారగుదురు) సమ్ముఖములో సుదృఢముగానే తెలియఁజెప్పుచు నుండుచో నావిద్వేషుల విద్వేషము, వారికిఁ దెలియకుండనే యంతరంగమునఁ జొచ్చి నెలకొనుచున్న యీయనురాగముచే శేపఁబడి మఱింత రేగి ప్రతిఘటనము లేమిచే నిర్వీర్య మయి కాలక్రమమున నీరసించి యాఱిపోగలదు. ఇందు కనేకాను భవములు నా కిటీవలివి కలవు. ఇట్లు ప్రవర్తింపఁ గల్గుటకు నాలో గురుదేవుల యనుగ్రహమును, శ్రీ గాంధిగారి దివ్య చారిత్రమును 'అంతర్బహిశ్చ' నాకు జాగ్రత్తను గొల్పినవి.



# 7

## శాస్త్రము – అనుభూతి

శ్రీసోమనాథశాస్త్రిలుగారి తపస్వితపై నాకు మహాభక్తి! కాని వారి ననువర్తింపవలె నని కాని, అనువర్తించినచోఁ గడతేరఁగల్గుదునని కాని నాకు తోఁచలేదు. యోగ సూత్రములను బాఠము చెప్పునపుడు వారు తాము యోగ సిద్ధికై కొంత పాటుపడితి మనియు, దానివల్ల ఆరోగ్యము చెడిన దనియు, ఆపద్ధతుల ననుభూతికిఁ దెచ్చుకొనఁజాలమయితి మనియుఁ జెప్పిరి. వారికే సాధ్యము కానిచో మమ్ము దీనిఁ జదివించు టేల యని నాకుఁ దోఁచెను. కాని కోపింతురని వారి నడుగనయితిని. మఱొకనాఁడు నాప్రశ్నమును వారే వేసికొని "మీలోనెవరయిన వీనిని సాధింపగంరేమో యత్నించి చూడండి. సరియయినగురువు దొరకునేమో చూడండి. నా కనుభూతి కలుగనంతమాత్రాన శాస్త్రమప్రమాణ మనుకోకండి. మీరుగా సాహసించకండి" అనిరి. ఆ మాట నాలోఁ జొచ్చుకొనిపోయినది. వారు మంత్రయోగమయులు. అనుష్ఠానమున గాఢతత్పరతయే కాని వారికి దాని ఫలిత మేమి అన్న యోచనమే యుండెడిదికాదు. చేయవలసినది గనుక చేయుచుండుటయే. ఇటీవల వారి తపఃప్రయత్నమునుగూర్చి యోచించుటలో నేతదర్థకమగు నుపనిషద్వాక్యము సమాధాయకముగాఁ దోఁచినది.

నేను నా యిర్వది యెనిమిదవ వత్సరమున భృక్తిరహితతారక రాజయోగమునఁజేరి యబ్బురపు టనుభూతులను బడయుచుండఁగా వారు సజీవులుగా తపోమయులుగా విరాజిల్లుచునే యుండిరి. తఱచుగా నేను స్వగ్రామమునకు వెళ్ళినపుడు చల్లపల్లి వెళ్ళియు, వారు వారి యల్లుఁగూతుళ్ల వర్తిల్లుచున్న మా స్వగ్రామమగు పెదకళ్లేపల్లికి విచ్చేసినపుడు సందర్శించియు నా విషయముల వారికి నెఱింగించుచునే యుంటిని. వా రెంతో కుతూహలముతోఁ దాము గూడ నాతో నొకతూరి కుంభకోణము వచ్చి శ్రీవారిని దర్శించి సంభాషించి యేమేమో పడయవలయునని యుత్సాహపడుచు వచ్చిరి. వారి కీయోగసంపర్కము కలుగఁజేయవలెనని కోరిక నాకును నుండెడిది. కాని యదియు జరుగలేదు.

వారు భౌతిక శరీరము విడిచినపిదప నాకుప్పుడి యెనిమిదవయేట నొక నాఁడు నాధ్యానసమయమున శ్రీవారును, మానాయనగారును, మామామగారును, నాతోపాటు ధ్యానానుభూతిలో నుండుట కొన్ని నిమిషములపాటు గోచరించెను. ఈ ముగ్గురకు నిట్టి యనుభూతి కలుగుఁ గా కని బహువారములునా ప్రార్థనమున గోరుకొనుచుండెడివాఁడను. కాన యీ యనుభూతి నాకు ముదము గొల్పినది.



# 8

## వెంకటశాస్త్రిగారికడ విద్యాభ్యాసంగము

శ్రీ సోమనాథ శాస్త్రులుగారిని వీడుట సమ్మతము గాకున్నను శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు క్రొత్తగా బందరు హైస్కూలులో నాంధ్రోపాధ్యాయులుగా వచ్చేసి యుండుటచేతను, వారిమహత్త్వము చుట్టుపట్టులయూళ్ళవా రందఱు చాల విస్తారముగాఁ జెప్పుకొనుచుండుటచేతను, శ్రీ సోమనాథశాస్త్రులుగారి దగ్గఱ సహాధ్యాయులముగా చదువుచున్న వారము ముగ్గురము అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, పిసిపాటి వెంకటరామశాస్త్రి, నేను బందరులో శ్రీవారి సన్నిధిని జదువుకొన నుత్సాహపడితిమి. తొలి యిద్దఱు ముందు బందరు చేరి సందర్భములు చూచుకొని నన్ను రమ్మందుమని వెడలిరి. వారి ప్రోత్సాహమున కొలఁది నాళ్ళకు నేనును బందరు చేరితిని. అప్పటికి నా వయస్సు పదునాలేం డ్లయి యుండును.

తెలుఁగున నా కేమేని యెఱుక యేర్పడె నన్నచో నది శ్రీ వెంకటశాస్త్రిగారి గురుతానుగ్రహప్రాప్తమే. వారి దగ్గఱ పుస్తకము పట్టి చదివినదానికంటె వారి ముఖతః వినోదగోష్ఠిలో విని నేర్చినది చాలా. ఆధ్యాత్మిక విషయమున బందరు వాసమునఁగాని శ్రీ శాస్త్రిగారి సన్నిధిని గాని నాకు కలిగిన యుద్బోధ మేమియు లే దనియే యనవలెను. అంతే కాదు. శ్రీ శాస్త్రిగారి సన్నిధిని అవధానధారణలు, పద్యరచనలు, ఉపన్యాస వినోదములు, కవితాకల్పనములు, వాదప్రతివాదములు, అహంతలు, మమతలు బలసి ఆధ్యాత్మచింత యంతర్ధాన మందిన దనవలెను. శ్రీ శాస్త్రిగారు మాయమర్మము నెఱుఁగని స్వచ్ఛహృదయులు. బందరు రాక పూర్వము వారు తీరు 'దేశాటనం పండితమిత్రతా చ' అన్న శ్లోకము చెప్పిన చాతుర్యమూలములుగలదై వర్తిల్లినది. అప్పటి దేశాటన పండితమిత్రతా రాజసభా ప్రవేశాదులు వారు చెప్పనువచ్చును. మేము విననువచ్చును. కాని పండిత మిత్రతకుఁ దర్వాతిపటియు, రాజసభా ప్రవేశమునకుఁ బూర్వపుదియు నగు చాతుర్యమూలము వారు చాటు చేయక సవిస్తరముగాఁజెప్పుచుండెడివారు. నేను సిగ్గునఁజిదికిపోవుచుండెడివాఁడను.

ఆ కాలముననే మా యన్నగారికి వివాహము జరగినది. ఆ వివాహము జరిపినవారు, నా పెదతండ్రిగారి బావమఱంది, సంగీత సాహిత్య విద్యారసికులు, దివిసీమలోని చోడవర గ్రామమున నెలకొన్నవారు, శ్రీ లంక నాగేశ్వరశాస్త్రి గారు. వారికి నామీఁద చాల వాత్సల్యము. ఆయన విధురులు. సంతతి లేదు. విద్యావినోదులే కాక వేశ్యావినోదులును మా యన్నగారి వివాహము తర్వాతఁ గొన్నాళ్ళ కొక పుత్రస్వీకారము కూడ వారు చేసికొనిరి. ఆ కుఱ్ఱవాని కుప నయనము చేసిరి. ఆ వివాహమునకు నుపనయనమునకును గొప్పగా భోగపు మేళములు ప్రాతస్సాయం కాలము లందు, రాత్రులందుఁ గూడ జరుగసాగినవి. వానినిఁ జూచుట కుద్యోగులు పలువురు వచ్చుట జరగెను. ఉపనయనము జరగిన తర్వాత కొన్నాళ్ళు నన్నక్కడ నిర్బంధించి వారు నిలుపుకొనిరి. సంస్కృత నాటక కథలు, కాదంబరీ కథ నన్ను మా మేనమామగారు వేశ్యాపరివారితు లయి చెప్పగోరుచుండిరి. నేనును చెప్పుచుంటిని. ఎన్నాళ్ళక్కడుండుట ? పదినాళ్ళ యిన తర్వాత ఆ యూరనుండి మా యూరికి వచ్చివేసితిని.

ఆ వేశ్యల శృంగారములు, ఆటపాటలు, నేను కథలు చెప్పుచున్నప్పుడు వారు నెఱపిన సౌహార్దము, వారిహాస్యగాడు, బ్రాహ్మణవృద్ధుడు, సంగీత సాహిత్య రసికుడు నన్ను మెచ్చుచుండుట, మా మేనమామగారు నన్ను ప్రతివత్సరము వేసగి సెలవులలో - శ్రీ వెంకటశాస్త్రిగారు బందరు విడిచి వెళ్లుదురు గాన—తమ యూరికి వచ్చియుండుమని కోరుట నన్ను ముగ్ధుని జేసి వైచినవి. మా యూరు విడిచి బందరు కేగి వారపు మెదుకులు తినుచు చదువుకొనుట వెగటు గొల్పసాగి నది. ఇల్లు విడిచి పదునాలుమైళ్ళు బందరు నడచి వెళ్ళుట యెప్పుడును పరిపాటియే యైనను నా కప్పు డది చాల బాధ గొల్పినది. ఒకటి రెండు ఫర్లాంగులు వెళ్ళుటే నాకు చాల కష్టమయ్యెను, అక్కడ నొక బురద కాల్వ దాటవలెను. వెనుకకు తిరిగి పోవుదునా యని తోఁచెను. బట్టలు సద్దుకొనుచు కొంచెము సేపు కూర్చుండి యోచించితిని. ఎన్నో చీకాకులు రేగినవి. శ్రీ వీరేశలింగముపంతులుగారి ప్రహస నములు, ఉపన్యాసములు నంతకు ముందు చదివి యుంటిని. వేశ్యల గూర్చి వారు వ్రాసిన వెల్లతలఁపునఁ బాఱినవి. ఇక నిట్టి గోష్ఠుల కెన్నఁడు గాని పోరాదని శపథముచేసికొంటిని. క్రీ. 1904 ప్రాంతముల మాట యిది. అటు తర్వాత నే నెన్నఁడును వేశ్యాభినయ దర్శనమునకుఁ బోయి నట్టెఱుక లేదు.

బందరులో చదువుకొనుచుండుకాలమున నేను శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులుగారి యింటను, శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి యింటను, వసించుచుండువాఁడను. వారి కప్పుడు నాపైఁ జాలవాత్సల్యము. శ్రీ సూర్యనారాయణరావుగారు వారి జీవితావసానము దాఁక నా యోగ క్షేమములు కనుగొనుచుండువారు. వారి ప్రేరణముననే నేను మద్రాసు చేరితిని. అప్పటికి నాకు పదునెనిమిదవ యేడు. వారు శ్రీ రెంటాల సుబ్బారావుగారికి నన్ను గూర్చి జాబు వ్రాసిరి.



# 9

## ధూమకేతు దర్శనము

మద్రాసులో మా బావగారు శ్రీ రామేశంగారి దగ్గఱ గుమాస్తా శ్రీ కాజా వెంకటశేషయ్యగా రుండిరి. వారి యండతో నేను మద్రాసులో నెలకొంటిని. మద్రాసు చేరగానే నాకు శ్రీపండిత గోపాలాచార్యులుగారు, శ్రీ పురాణం నాగ భూషణముగారు మిత్రు లయిరి. గోపాలాచార్యులుగారి ద్వారా నాకు శ్రీ పసప్పాకం అనంతాచార్యులుగారితోను, వారి కుమారులగు శ్రీనివాసాచార్యులుగారితోను మైత్రి యేర్పడెను. మద్రాసుచేరగానే వెస్లీ మిషన్ హైస్కూలులో తెలుఁగు పండితుఁడ నుగా నేను గుదుర్కొంటిని. రెండేం డక్కడ నుంటిని. ఆ నాళ్ళలో తఱచుగా ప్రాచ్యలిఖిత పుస్తకశాల కరుగుచు నక్కడి గ్రంథములు చదువుచు నుంటిని.

శ్రీ వేపా రామేశముగారితో నేను దఱచుగా విద్యా వినోద మనుభవించు చుండువాఁడను. రామేశంగారు విద్యారాశి. గణిత ఖగోళ చరిత్రాదిశాస్త్రములందు నిష్ణాతులు. వారికడ ఖగోళశాస్త్రరహస్యము లెన్నో తెలిసికొనుచుండెడివాఁడను. వారికొక టెలస్కోపు కలదు. వారి ధర్మపత్ని యంతర్వత్నిగా నుండి పురుటికై పుట్టినింటికి వెళ్ళుచుండు సందర్భములలో నెలల తరబడి రాత్రులందు వారితో చాలసేపు నక్షత్రగ్రహ మండలములను బరిశీలించుచుండువాఁడను. ఎన్నో ఖగోళ శాస్త్ర రహస్యములు వా రెఱుఁగఁ జెప్పుచుండువారు. నేర్చుకొనుచుండెడివాఁడను. ఎపిగ్రాఫియా ఇండికా, ఇండియన్ ఆంటిక్వరీ, ఎపిగ్రాఫికల్ రిపోర్టులు మొద లగు చరిత్రాధార గ్రంథము లెల్ల వారి దగ్గఱఁ గలవు. వాని నెల్లఁ జదువఁ దెచ్చుకొని చదువుచుండువాఁడను.

1910వ సంవత్సరము. హాలిస్‌కామెట్టు వచ్చినప్పుడు — ఇంకా కొన్నాళ్ళ కది స్థూలదృష్టికి గోచరించుననఁగా టెలస్కోపుతోను, బైనాక్యులర్‌తోను తెల్ల వారు జామున లేచి ఆకాశ భాగమును మే మిర్వురమును బరిశీలించుచుండువారము. ఆ ధూమకేతువు తొలుత అరుణోదయ మగుచుండగా తూర్పుదిక్కున గోచరిం

చెను. అది యుదయించునంతలో ఉదయారుణకాంతులు క్రమ్ముకొనఁగా కానరాక పోయెడిది. ఒకనాఁడు బైనాక్యులర్ చేతనుంచుకొని మేడ దిగి రోడ్ మీఁదికి పోయి పరిశీలింపఁగా నా కది వెల్తురు చీపురుకట్టవలె గోచరించెను. పర్వెత్తుకొని (అంతలో అరుణద్యుతులు క్రమ్ముకొచు నని) రామేశంగారికి చూపవచ్చితిని. ఆ ఆత్రపాటులో మేడమెట్లు కొట్టుకొని మోఁకాలి మీఁద చర్మము చిట్లి నెత్తురు కారుచుండెను. అది చూడక నేను కేతువు కనబడెనని స్పష్టముగా గోచరించుటకు టెలస్కోపును సర్దిదిప్పు చుంటిని. నెత్తురు చూచి ఇదేమని రామేశంగా రడిగిరి. అప్పుడు దెబ్బగుర్తించితిని. అంతలోనే టెలస్కోపులో స్పష్టముగా కేతువును గుర్తించితిని. రామేశంగారు నాయుద్వేగమును, రక్తస్రావబాధను గూడ గుర్తింపమిని జూచి నివ్వెఱ చెందిరి. నివ్వెఱ కొంత ఉడిగి టెలస్కోపులో కేతువును గుర్తుపట్టుచుండగా వెలుఁగు రేకలు చెలరేగి కానరానీయవయ్యెను. మర్నాటి తెల్లవారుజామున నిర్వురము లేచితిమి. జాగ్రత్తగా గుర్తించి నిన్నటి యాకాసపు పట్టు చూపఁగా రామేశముగారు స్పష్టముగా చూచి యప్పుడే దాని గూర్చి హిందూ పత్రికకు వ్రాసిరి. మర్నాడు వారికి కొన్ని టెలిగ్రాములు దాని యెఱుకకై వచ్చినవి. అటుపై నాల్గయిదు రోజులకుఁ గాబోలు నది యందఱ యెఱుకకు నందినది.

ఆ ధూమకేతువును దక్షిణహిందూదేశమున ప్రజాసామాన్యమున తొలుత గుర్తించినవాఁడను నే నగుటలో మహత్తరమయిన విశేషమేదో ఉండ బోలు నని నే నిటీవల విశ్వసించుచున్నాను. అందుకే దీని గూర్చి యించుకంత హెచ్చుగా వ్రాసితిని. తత్ప్రయోజన మేదో ముందు తెలియఁగలదు.



# 10

## బ్రహ్మచర్యము - గార్హస్థ్యము

రెండేండ్లు కెలెట్ హైస్కూలులో నేను తెల్గు పండితుఁడనుగా నుండఁగా నాకు వివాహనిర్ణయము జరిగి మా తలిదండ్రులు నన్నింటికి రమ్మనఁగా నే నింటికి వెళ్లుచు బందరులో శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు గారింట దిగితిని. అవి హైస్కూలు వేసవి సెలవురోజులు. సూర్యనారాయణరావుగారు మద్రాసు చేరునపుడు నన్ను దఱచుగా ఇంటికి వచ్చుచుండవల దనియు, మద్రాసులో ఓరియంటల్ లైబ్రరీలో గ్రంథములను విశ్రాంతి సమయములలో చదువుచు, వైదుష్యమును వృద్ధిపఱచుకొనుచు నుండవలసిన దనియు, ఇప్పుడే వివాహము చేసికొని సంసారపు బాదర బందీలో పడవల దనియు, యూరపులో అనేకులు ఆజీవితము అవివాహితులుగానే ఉండి గొప్ప విజ్ఞానము గడించి, ధనము గడించి, ఆ ధనమును సంఘోపకారమునకై సమర్పింతు రనియు, కొందఱేని లోకసేవకై యవివాహితులుగా నెలకొను టావశ్యక మనియు నాకు హెచ్చరికగా జెప్పుచుండుట కలదు.

అప్పుడు నా రాక వారి కతృప్తి గొల్పెను. చల్లని నూతి నీట నిర్వ్యరము హాయిగా స్నానము చేసి భోజనమునకుఁ గూర్చుంటిమి. చెమటలు దిగజారుచున్నవి. సూర్యనారాయణరావుగారి ధర్మపత్ని శ్రీ పార్వతమ్మగారు విసనకఱ్ఱతో విసరుచు చెమటరోఁత దొలగించుచు హాయిఁగూర్చుచుండిరి. భోజనసమయమున మరల వారు నాకథ నుపక్రమించిరి. 'ఇంటికి రాకుండ మద్రాసులోనే ఉండుమంటిని గదా! నీ విప్పు డేల రావలెను? పెండ్లిప్రయత్న మేమేని సాగెనా? పలుతూరులు నిన్ను పెండ్లాడ నాత్రపడవలదంటిని కదా? యూరపులో ననేకులు ప్రౌఢవయస్సు వచ్చి, విద్యా ధనార్జనము చేసి యటుపై పెండ్లాడుట, కొందఱు పెండ్లాడకే తమ విద్యాధనములను లోకసేవకై వినియోగించుట జరగుచుండు నంటిని గదా! బీదఱికముతో నలగులపడుచు నొకపడుచును బెండ్లాడి యామెను గూడ దారిద్ర్యశోకమున పాల్పఱచుటకా పెండ్లాడుట? విద్యావిశేషములను,

ధనమును గడించి తలిదండ్రులను సుఖపటిచి చాలినంత ధనము సేకరింప గల్గినచో, సౌకర్య మున్నచో నటుతర్వాత పెండ్లాడిన నాడదగును గాని యిప్పు డేమి పెండ్లి? విద్యావివేకములు లేని యాడుపడుచులను బెండ్లాడి ఏడాదికి, రెండేండ్లకు బిడ్డలు పుట్టుచుండుట, ఈదురో దేవుడా అనుచున్నట్టు చాలినంతగా గృహాది సౌకర్యము, శిశుపోషణ సౌకర్యము లేక పోగా చాలీచాలని జీవితాయతితో నిరుత్సాహనిహతములై బాధపడుచున్న కుటుంబముల నెన్నింటిని జూచుట లేదు? అందులో నీవును జేరి దిగనాసిల్ల నభిలషింతువా? అని ఇంక నిత్యాదివిధముల తీవ్రభాషతో వారు నన్ను మందలింపసాగిరి. నేను దలవాల్చుకొని తినుచున్న యన్నపు ముద్ద మ్రింగుడు పడక మాటాడ నేరక సిగ్గుతో చిటికి వదవదలాడు చుంటిని. శ్రీ పార్వతమ్మగా రందుకొనిరి. 'ఇటు వినం! యూరపుదేశము వారి బ్రహ్మచర్యము మాట యెత్తకండి. ఆ బ్రహ్మచర్యము మనవారి కెందుకు గాని, వీరిని బాగుగా ధనార్జనము చేసిన తర్వాత, ప్రౌఢవయస్సు వచ్చిన తర్వాత పెండ్లాడు మనుచుంటిరే! మన దేశపు సర్వైశ్వర్యమును జుఱ్ఱుకొనుచున్నారు గనుక యూరపువారు ఏ విద్యచేతనైన నెంత ధనమునైన నార్జింపఁ గల్గుచున్నారు. కట్టుబట్ట, కుట్టుసూది కూడ వారే తయారు చేయుచు మనదేశమువారి కమ్ముచు ధనప్రవాహము తమ దేశముమీఁద పాఱుచుండఁబట్టి లోకోపకృతి చేయగల్గు చున్నారు. నిజమే! అంత ధన మార్జించుటకు మనదేశమువారికి సౌకర్యము లేవీ? ప్రౌఢవయస్సు వచ్చిన తర్వాత పెండ్లాడుట యూరపువారికి చెల్లవచ్చును గాని మన వారికి చెల్ల నేరదు. ఆ దేశమున యేఁబది యఱువది యేండ్ల వరుని బ్రహ్మచర్యమును, ముప్పది నలువది యేండ్ల వధువు కన్యాత్వమును మనకు విశ్వసింపరానివి. చల్లని యూరపు దేశములో నవి చెల్లు నేమో నే నెఱుఁగను. మనదేశము వారి కావయస్సు యించుమించుగా వార్ధక కాలము. ధనార్జనము చేయునే కాక! అప్పుడు వివాహ మాడుట మన దేశమువారికి గతజల సేతుబంధనమే!

మొన్న వింటిరి గదా! యధికవిద్యావతిని బెండ్లాడు భర్తల గోడును! హైద్రాబాదులో నొక గొప్ప డాక్టరు విద్యావతిని బెండ్లాడి యామె తఱచుగా యూరపు మొదలగు ఖండాంతరములకు వెళ్ళి వచ్చుచు నెలలు, వత్సరములు దేశాంతరములం దుండుటయు, తన యార్జన మెల్ల నామె యాత్రావ్యయములకై

పంపవలసి వచ్చుచుండుటయు, తన బంగళాలో గోడలు బూజుపట్టి చిత్రరచన లెన్నో సంస్కారము లేక తార్మారై చెడుచుండుటయు, దనకు గార్హస్థ్య సౌఖ్యము దుర్లభముగా నుండుటయు నొక మిత్రునితో జెప్పి వాపోవఁగా నా మిత్రుడు మీతో చెప్పుట పీ నడుమ మీరు వినియుంటిరి గదా! ఏ యెండ కా గొడు గన్నట్టుండ వలెనే కాని తనకు మించిన విద్యావతిని బెండ్లాడుటలో చిక్కులే కాని సేమ ముండుట యసాధారణము.

చూడండి! ఆరంభముననే తనకు దగినపడుచును బెండ్లాడి రోడ్డు రిపేరు చేయుచున్న యుప్పరివాడు పగలెల్ల మట్టిపనిచేయుచున్నాడు. సంజకడ ఉడుకు నీరు కాచి, యిల్లాలు వీఁపు దోమి స్నానము చేయించగా భర్త సుఖస్నాతుఁడై భార్యతో గంజి యన్నము, ఉప్పు, పచ్చిమిరపకాయ నంజుకొనుచు కడుపార నారగించి, తమకు గలిగిన చిన్నబిడ్డ నక్కడి చెట్టుకొమ్మకు వ్రేలగట్టిన చీర యుయ్యేలలో నూగించి, చల్లగాలిలో నా బిడ్డ సుఖనిద్ర పడయగాఁ జెట్టు క్రింద సుఖశయితు లగుట చూచుచుంటిమి గదా! వారి దాంపత్యమున హృద్యత గోచరించుట లేదా?

ఏకైక వ్యక్తిగా మీరు మిగిలిన మీకుటుంబమున నన్నుఁ బెండ్లాడుటచే వంశవృద్ధి గలిగి మీరు సుఖించుచుండుట గుర్తునకు వచ్చుట లేదా? నే నుండుటచే గదా మీకిట్టి సుఖభోజనము దొరకుట? వంటవానిని గుదుర్చుకొని వానివంటతో భోజనము జరపుకొనుటలోని యిక్కట్టులను గుర్తించుచునే యుంటిమి గదా! మీకు ఆరోగ్యకరములు, ప్రియములు నయినకూరగాయలను నేను దెప్పించి మీకు ప్రియ మయిన తీరున వంట చేయించు చుండుటచేతఁగాదా మీ యారోగ్యము సరిగా నుండుట, ప్రియముగా భోజనము సాగుట, ఇంటికి వచ్చిన మీకు కోర్టులోని పరిశ్రమపుఁ బరిహారము మావినోదముతో జరగుట యగుచున్నది గదా! ఇంతేల! ఈ యెండ యుమ్మదములో చెమటలు దిగజారు చుండఁగా నే నుండి విసనకఱ్ఱతో విసరుచుండుటచే గాదా శ్రమ మెఱుఁగకుండ మీరు హాయిగా నారగింపఁగల్గుట? నేఁటి యీ వంటకములు వంటవాఁడే చేసినను నేను దగ్గర నుండి మీకు ప్రియ మయిన కూరలు తెప్పించి తఱిగి యిచ్చి మీకు నచ్చినవిధానమున మీ కెంత కావలెనో అంతగా ఉప్పుకారములు వేయించి [illegible] గాదా యిట్టి [illegible] మీకు [illegible]!

మన శాస్త్రిలుగా రిక్కడ నున్నప్పుడు గొంత కొంత సంస్కృ తాంధ్రముల పరిచితి హెచ్చి తఱచుగా భారతాదులు చదువుచుండుటచే సందలి పద్యము లివి నా నోటికి వచ్చియున్నవి చిత్తగించండి !

అధికదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూపె యెందు
నౌనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంత లయ్యును నాపద లెఱుక పడవు
అలసి నెడ డస్సి నెడ నా
కలి తృష్ణయు నైనయెడలఁ గడుకొని ధరణీ
తలనాథ ! పురుషునకు ని
మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్.

(నన్నయ నలోపాఖ్యానము.)

పార్వతమ్మగా రింత పలుకగా, నాకు ముద్ద మ్రింగుడు పడసాగగా సూర్యనారాయణరావుగారు నిరుత్తరు లయిరి. నన్నుఁ జూచి 'శీఘ్రముగా నింటికి బోయి వివాహ మాడుదువుతే ! నీవాలకము చూడఁగా పెండ్లి ప్రయత్నమునవే యింటికి వెళ్లుటగా నున్నట్టున్నది. శుభమస్తు' అనిరి.



# 11

## వివాహము

ఇర్వది రెండవయేట నాకు పెండ్లి జరగినది. మాయూరి కాఱుమైళ్ళ దూరమున నున్న గంటసాల నాయత్తవారి యూరు. ఆయూరే నా మేనమామగారి యూరును. తొంబదియేండ్లకు పైబడినవయస్సువారు, మా మేనమామగారు శ్రీ పిసిపాటి వేంకటాద్రిగా రిప్పటికి నారోగ్యముతో నున్నారు. వారికి నేడ్గురుపుత్రులే కలిగిరి కాని పుత్రికాసంతానము లేదయ్యెను. మాతోడిసంబంధము తర్వాత లేక పోవు నన్న కొఱంతతో వారి జ్ఞాతులగు మా మామగారిని నాకు పిల్ల నిమ్మని వారు కోరిరి. వారికుమారుఁ డప్పటికి రెండేండ్లకుముందు స్వర్గస్థుఁ డయినవాఁడు, శ్రీ సోమనాథశాస్త్రులుగారి కడను, శ్రీ వెంకటశాస్త్రిగారి కడను నాతో సహాధ్యాయుఁడుగా నున్నవాఁడు, వెంకటరామశాస్త్రి జీవించియున్నప్పుడు వారిమీఁది యాదరము వెల్లడించుచుండుటచేతను, మామేనమామగారి కోరికచేతను, భూవసతి లేదన్న కొఱఁతను దలఁచి సందేహించుచున్నను మా సంబంధమున కెట్టకేలకు మామామగా రంగీకరించిరి. వారు ప్రశాంత చిత్తులు, సద్వర్తనులు, అమాయకులు. మా తండ్రి గారివలెనే 'కడిపెడు బిడ్డలు గలవారు.

వివాహ మయినది. మామాతృశ్రీ గారి మీఁది భక్తిచేతను, వారి పుట్టిన యూరని, వారియింటి పేరివారని నేనెంతో తనివితో నీ సంబంధమును ప్రేమించితిని. వివాహ మయినతోడ్తో మద్రాసు వచ్చి వేసితిని. అప్పుడు నానివాసము మైలాపూరులో. తిరువల్లిక్కేణి హైస్కూలుకు ప్రతిదినము రాకపోకలు తొమ్మిది గంటలకు హోటలులో భోజనము చేసి తిర్వలిక్కేణికి నడచి వెళ్లి సాయంకాలము తిరిగి నడచి వచ్చి రాత్రి భోజనము చేయుట. దీనిచే నాహారము చాలక కాఁబోలును నీరసముగానే ఉండెడివాఁడను. నీరసమే తప్ప వ్యాధి యేదియును లేదు. అప్పు

దప్పుడు కృష్ణామండలమందలి స్వగ్రామమునకు వెళ్ళి అక్కడ కమ్మని నెయ్యి పెరుగులతోడి భోజనము చేసినప్పుడు శరీరమునకు మంచి బలోత్సాహములు లభించుచుండెడివి! సంవత్సరమున కొకతూరి తప్పకుండ నింటికి వెళ్లుచు నట్టి బలోత్సాహముల నార్జించుకొని వచ్చి వానిని మద్రాసులో వ్యయించుచుండినట్లు తోచుచుండెడిది. ఈ ప్రయోజనమునకై వివాహానంతరము వేసంగిలో నేనింటికి వెళ్ళితిని.



# 12

## బండి పాటు

మాయూరి కాఱుమైళ్ళ దూరమున అవనిగడ్డయని గ్రామము గలదు. అది తాలూకా ప్రధాన స్థానము. మాయన్న గారక్కడ పోస్టుమాస్టరు. వారి కుటుంబమును జూచుటకై నే నాయూరికి వెళ్ళి తిరిగి వచ్చుచుంటిని. మాయూరివారే, మహనీయులు, గొప్ప వేదవేదాంగ వేత్తలు, నాపై నమితవాత్సల్యము గలవారు, వృద్ధులు శ్రీ యడవల్లి అప్పావధానులుగారు కడు వృద్ధ యయిన వారి యత్తగారితో బండిమీఁద అవనిగడ్డనుండియే మాయూరికి విచ్చేయుచు నన్నుఁ గూడ బండిలోఁ గూర్చుండ నిర్బంధించిరి. నేనేవేవో మద్రాసు పుస్తకశాలలోని గ్రంథములఁగూర్చి ముచ్చటించుచు వారిని వినోదపఱచుచుంటిని. బండి యొకటిన్నరమైలు సాగి వచ్చెను.

అవనిగడ్డకు మాయూరికి నడుమ కృష్ణానది కలదు. అది వేసగి కనుక పాటిరేవు గలదే. బండి దానిలో నుండి సాగి పోవచ్చును. కాని గట్టున నుండి యేటిలోనికి కొన్ని నిలువుల లోతు దిగవలెను. బండి యట్లు దిగుచుండెను. బండి తోలుచున్న రైతు (మాయూరివాఁడే) చుట్ట కాల్చుకొనుట కంతకు ముందే బండి దిగెను. గట్టున నుండి పల్లమునకు బండి గాడిలోనుండి వడిగా దిగజాఱునా సమయమునకు సరిగా నాతఁడు మూత్రోత్సర్గమునకుఁ బోయి వెనుకబడెను. బండిచక్రమొకటి బండి గాడిపల్లపుజాలులో నుండఁగా మఱొకచక్రము గట్టుమీఁది కెక్కెను. ఉపక్రమమున నా యెగుడుదిగుడు కొంచెముగానే యుండెను. కాని రెండు మూఁడు గజములు సాగునప్పటి కొడ్డగెడవుగా నయ్యెను. ఎద్దు వడిగా దిగిపోవుచుండెను. బండి కడయంచున నేను గూర్చుంటిని. ఇఁక నొక క్షణములో నా జీవిత మటో యిటో ఏదో అగుదశ దాపురించినది సుమా యనుకొనుట నే నెఱుఁగుదును. ఈ యెఱుక బండితుదిపట్టున నుండి యెడ్ల దిగుడు దూకుడును, చక్రముల యొడ్డగెడవును—వెలుపలికి చూడ్కి పాఱుచున్నది గాన—నేను గుర్తించితిని గాని బండి లోతట్టున గూడులో నొదిగి యున్న యాయిద్దఱు నంతగా గుర్తింప రైరి. ఇహ

లోకప్రజ్ఞ యీ శరీరమున నుండుటో, ఊడుటో—ఈ లోకముతో సంబంధము తీరనున్నదేమో అన్న తలఁపు నాలో కలిగినక్షణమే యెఱుఁగుదును గాని తర్వాత నన్నెఱుఁగను. నా యునికి నెఱుఁగను.

ఈ స్థితిలో కొన్ని క్షణములో నిమిషము లొకటి రెండో కడచియుండఁ బోలును! 'చండాలుడా! లక్షరూపాయల విలువ చేసే మనిషిని చంపి వేస్తివిరా! చండాలుడా!' అన్న యవధానులుగారి యేడ్పుటఱపుతో ప్రజ్ఞ గాంచితిని. 'బ్రతికి ఉన్నానండీ బాబూ! యేడ్వకండి' అంటిని. అప్పావధానులుగారు నాయెదుట నిరపాయముగా నిలిచియుండిరి. నా కైహికప్రజ్ఞ కలిగినందుకు, అప్పావధానులుగారు నిరపాయులుగా నున్నందుకు తనిసి 'సోమిదేవమ్మగా (వారి యత్తగారు) రేమైరండీ' అంటిని. 'బ్రతికున్నావా నాయనా' అనుచు నామె పర్వెత్తి వచ్చెను. 'మా కిద్దఱికీ మొండిఘటాలకి ఏమీ దెబ్బ తగులలేదు. నాయనా! నీ చెయ్యి యిదేమిటి?' అని ఆమె యేడ్వసాగెను. అప్పుడు నేను నా చేతులను జూచుకొంటిని. కాని అందాఁక నేను బాధ నెఱుఁగను. నా దక్షిణబాహుమూలము నా కడుపు మీఁద వ్రేలాడుచుండెను. ఆ వికృతి చూడఁగా నాకు వాంతి, మైకము, కంపము కలుగఁ జొచ్చెను. ఇం కేమేమి యంగవికృతి కలిగెనో; ముం దేమగునో అన్న కంగారుతో అవధానులుగారి నిట్లు ప్రార్థించితిని. 'నా పూర్వకర్మానుభవమేదో నేననుభవించుచున్నాను. నా స్థితి యేమగునో! మా తల్లిదండ్రులకు నెమ్మదిగా నా స్థితి తెలుపండి. ఈ బండివానికి ఏ మాత్రము క్లేశము కలుగరాదు. నా ప్రాణమున్నా, పోయినా వీనిని నన్నుగా భావించి కాపాడండి! కాని నిందాదులు చేయకండి. దప్పి, దప్పి' యనుచు మైమఱుపాటు చెందితిని.

కొంత సేపటికి చల్లని మంచినీరు, మజ్జిగ దగ్గఱి క్రొత్తపేట బ్రాహ్మలు తెచ్చి యీయఁగా, చన్నీటి గుడ్డతో మొగము తుడిచి, ప్రజ్ఞ రప్పించి యిచ్చిరి. మా యూరి కరణముగారు, మా నాయనగారి బాల్యమిత్రము శ్రీ కొడాలి వెంకయ్యగా రింతలో నక్కడికి బండిమీఁద వచ్చిరి. నన్నాదరించి తన బండిమీఁద నెక్కించి నన్ను వెనుకకు అవనిగడ్డకే— ఆస్మృతి కలదు గాన, మా యన్నగారు కలరు గాన— త్రిప్పి పంపి నాకొక మిత్రుని తోడిచ్చి, బోల్తాకొట్టిన బండిని లేవనెత్తి, దానిమీఁదను నా బండిలోని [illegible] వల్లికి వెళ్ళిరి. బండి నెమ్మ

దిగా నడచినను జాటిపోయి ప్రేలాడుచేతితో వికారగ్రస్తుఁడ నయి యున్న నన్నువనిగడ్డ చేర్చిరి.

నాఁటిరాత్రి— ఆస్పత్రి అసిస్టెంటు ఊర లేఁడు గాన కంపౌండరే ఒక సాహెబు నా చేతిని సరిచిద్దఁ జొచ్చెను. క్లోరోఫారం ఇయ్యలేదు. చంకక్రింద గుడ్డ మడత బెట్టి దిండుగా నుంచి ఇంకొక తుండుగుడ్డ చంకక్రింద దూర్చి యొకరు తల దగ్గఱనుండి లాగుట, ఇంకొకరు నా చేతిని కాళ్ళ దిగువ నుండి లాగుట సాగించిరి. జబ్బ మజ్జులు చిఱుగుచున్నట్లయ్యెను. గగ్గోలు పెట్టితిని. అయినను విడువక లాగిరి. ఢమ్మని మ్రోఁత మ్రోగెను. చేయి స్వస్థానము చేరె నని చెప్పి కంపౌండరు కట్టుకట్టెను. మర్నాడు ఆస్పత్రి అసిస్టెంటు వచ్చెను. నాకు చేయి రుబ్బురోలువలె వాచెను. తీవ్రజ్వరము వచ్చెను. నాల్గయిదు రోజు లుంటిని, వాపు తీసినదిగాని చేయి తేవదు. ఆస్పత్రి అసిస్టెంటు ఉద్యోగమునకు, జీవితమునకుఁ గూడ తుది దశలో నున్నవాఁడు (కొలఁది రోజులకే రిటైరగుట, స్వర్గస్థుడగుట జరగెను, అతిమాత్ర వ్యాధగ్రస్తుడు) నన్ను బాధించుటతప్ప సరిదిద్దలేకపోయెను.

ఇంటికి వచ్చి, అక్కడనుండి ఇందరు వచ్చి శ్రీవల్లూరి సూర్యనారాయణ రావుగారిని తోడఁబిలుచుకొని ఆస్పత్రికి వెళ్ళితిని. సుబ్బయ్యర్ అను సర్జన్ ఉండెను. సూర్యనారాయణరావుగారి మాట విని వెంటనే క్లోరోఫారం ఇచ్చి చేయి సరిదిద్ది కట్టు కట్టెను మర్నాడట నుండి ధన తృష్ణతో నన్ను పీడింపసాగెను.

వెంటనే మద్రాసు వచ్చి నాకు పరిచితు లయిన డాక్టరు నంజుండరావుగారికి చూపితిని. వారు 'ఇప్పటికే చేతి సంధిబంధములు చాల శిథిలమయి యున్నవి. డాక్టర్ల కిక చూపవద్దు. ఘృతదధిప్లుతముగా భోజనము చేయుచు జబ్బకు కొబ్బరి నూనె, వెన్న, నేయి వగైరా స్నేహద్రవ్యములు రాచి, చన్నీటి కొళాయిక్రింద ధారగా నీరు పడునట్లు హెచ్చు సేపు కూర్చుంటి వేని క్రిమక్రిమముగా చక్కబడగల'దని చెప్పిరి. అట్లే చేయుచుంటిని కాని బోర్డుమీదఁ సీమసున్నముతో నే దేని వ్రాయుటకు రెండవచేతి తోడ్పాటుతో గాని చేతి నెత్తి పట్టి యుంచలేక పోవుచుంటిని. మంచినీటి చెంబును కొన్ని గజములు దూరమైన మోసికొనిపోలకుంటిని. క్రమక్రమముగా నంజుండరావుగారు చెప్పినట్లు చేయుచుండుటచే కొంత నయమాయెను

కలుగుటో, అసౌకర్య సహనమున కలవాటు పడుటో యయ్యెను. కాని యది యేలో నానాఁటికి మనసు నిరుత్సాహగ్రస్తము కాఁజొచ్చెను.

స్వజనము నా స్థితికి వగచుచు 'పెండ్లాడిన తర్వాత వీనిస్థితి వికృతి చెందుచున్నది. ఈ వివాహము వీనికి శుభప్రదముగా లేదు' అని పరోక్షముగాను, సనసన్నగా ప్రత్యక్షముగాను గూడ మాటాడఁజొచ్చెను. నా కది దుశ్శ్రావమయ్యెను. 'ఇది దైవనిర్ణీతము. ఇందు మంచినే గుర్తించవలెను గాని చెడుగులను వెదకి పట్టుచు మనసును చిఱుకకొట్టుకొనరా' దని నే నెదురాడితిని అభము శుభము నెఱుఁగని పదియేండ్ల బాలికనుగూర్చి గర్హణ నాకు చీకాకు గొల్పెను. అమాయికయయిన యా బాలికయెడ నా కమితానురాగ మేర్పడెను. ఆ బాలికవల్ల నేను మేలే పొందఁగల్గుదు నని విశ్వసించితిని. ఇది నా గుండెంలో మాత్రమే తొణికిసలాడుచుండిన తలఁపు.



# 13

## శకునపరిగణనము

అజ్ఞాననిహతమై యుండుటచే దేశమంతట నిట్టి యపభ్రంశపు తంతువులు నిండారి యున్నవి. పెద్దపెద్దలు, కొమ్ములు దిరిగిన విద్వాంసులు, మహోన్నత పదవులం దున్నవారు గూడ నింటనుండి యేదేని పనిమీఁద బయటికి వెడలునపు డెదురుగా నెవ్వరు వచ్చుచున్నారో యని పరిశీలింతురు. కుగ్రామములలో నట్టి పరిశీలనము తగునేమో, అర్థవంతమగునేమో కాని వేలకొలఁది ప్రజలు గల నగరములలో నట్టి పరిశీలనము చీకాకు గొల్పును. సమకాలముననే వీధులలో 'పంచ శుభం పంచాశుభమ్' అన్నట్టు కలసికట్టుగానో, ముందువెనుకలుగానో సభర్తృ కలు, అభర్తృకలు, ఒంటి బ్రాహ్మణులు, పల్వురు బ్రాహ్మణులు తారసిల్లుచునే యుందురు. ఇందు పౌర్వాపర్యములు పర్యాలోచించుచుందురు. మఱియు ఫలాని వితంతువు, ఫలాని బ్రాహ్మణుఁడు ఎదురుగా వచ్చినప్పుడు కార్యము నిర్వక్ర ముగా నిర్వహణము చెందునని వారు విశ్వసించుశకునశాస్త్రమున కపవాదముగా విశ్వసించుట కలదు. వారట్లు వచ్చినపుడు మంచి జరుగుట కేవో కారణములు, యుక్తులు నసందర్భముగా నుపాంశువుగా గణించుట కలదు.

తాము ప్రయాణ మగువేళకు బ్రాహ్మణుఁడేని, ఆతఁడు, కుమారుఁడో, అన్నో, తమ్ముఁడో అయినను నెదురుగా వచ్చినచో వ్యంగ్యముగా మొగము చిట్లించుకొని గర్హించుటో, వాచ్యముగానే తెగడుటో జరగుచుండును. తన యింటి లోని వారే అయినను, పరాయివారే అయినను వితంతువులు వచ్చినచో గర్హించు టయు, ప్రయాణము నిలుపుటయు జరగుచుండును. మఱీ వింత— ప్రయాణ మయిన వ్యక్తి వితంతువే అయినను గూడ తనకు వితంతు వెదురుగా వచ్చిన గర్హించును. ఈ శకునపరీక్షలవల్ల ప్రయాణముల నాపుకొనువారును, ననివార్య ముగా పయన మయినను నిరుత్సాహనిహతిచే సరిగా సాగించుకొనలేక ఎదురు వచ్చిన వారిని గర్హించుటచే వారితోను, వారి కుటుంబముతోను దీర్ఘవైరము తెచ్చు కొనువారును నెందఱో ఉన్నారు. రైలు ప్రయాణములకు శకున ముహూర్త పరి

గణనము చేయుచు అనుకూల శకునముహూర్తాదులకై కొంతసే పాగి పోవ్వటో చాల ముందుగానే పయన మగుటో చేయువారున్నారు.

మన మంచిచెడ్డలకు మనమే ప్రవర్తకుల మనీ, మన సత్కార్యసత్సం కల్పబలముచే మన మంచిని మనమే సాధించుకొనఁగల్గుదుము గా కనీ లోఁతయిన పట్టుదలతో ప్రవర్తించు వా రెట్టి ఓలిపి ఓకాకులకు పాల్పడరు. మంచి శకునముల కెన్నింటికో దుష్ఫలితములు గలుగుచుండుట, దుశ్శకునముల కెన్నింటికో సత్ఫలితములు గల్గుట గుర్తించుచున్నను గూడ శాస్త్రము ప్రమాణమని ప్రామాణ్యా నిశ్చయము లేకున్నను దానినే విశ్వసించుచుండవలెనని దాని కేవో శ్లోకము ఉదాహరించుచు సమర్థించుకొనుచుండుట యజ్ఞానపుఁ బిరికితన మనవలదా? గర్భవతులు గ్రహణములఁ జూడరా దనుట, ఆదివారమునాఁడుసిరికపచ్చడి తినరా దనుట, రాత్రులందు లవణము పేరు— ఉప్పు— అన్న తెలుఁగు పేరే— పేర్కొన రాదనుట (లవణము — బుట్టలోనిది — చెప్పరానిది ఇత్యాది విధములఁ దెలుప వచ్చును.) మొదలయిన విట్టివే.

మన తలఁపులలో, పలుకులలో, పనులలో మంచి చెడుగులు పెనవేసికొని సాగుచున్నవి. చెడుగు లేని యచ్చ మంచితనము మానవత కింకను నంద లేదు. జన్మము లెత్తఁగా నెత్తఁగా సత్త్వము హెచ్చి కీళ్ళను దొలఁగించుకొని మేళ్ళను పెంపొందించుకొనవలయు నన్న కోర్కి పుటములు పడగా పడగా బంగారుకు వన్నె హెచ్చినట్టు మానవునిలో హెచ్చఁ జొచ్చెను. సద్భావ ప్రాబల్యము కలిగినప్పుడు ప్రపంచము నాలుగంచుల ప్రజాసంఘము నెల్ల పాలజూడఁ గల్గినప్పుడు దేశజాతి కులాశ్రయము లయిన నిరర్థకాచారములు తొలఁగి పోగలవు.

స్వీయు లందరు నానాఁడు నా వివాహమును గూర్చి వివాహిత యగు కన్యను గూర్చి యతృప్తి చెందిరి గాని, కొంత నాకు గూడ వెలుపు గల్గుస్థితివలె నేర్పడెను గాని కాలము కొంత గడచినతరువాత సందఅనిశ్చయములును దల్లక్రిందులై పోయినవి. అవి ముందు ముందు తెలియఁగలవు. అట్టి శుభ పరివర్తనము కలుగుటకు వివాహమయిన తర్వాత సంవత్సరము లెనిమిది గడపవలసెను.



# 14

## సాహిత్యజీవనము - అరకుడుపు

నేను మద్రాసు వచ్చిన తర్వాత మైలాపూరులో మా బావగారితో కలసియే యుంటిని గాని, భోజనాదికము పూటకూటియింట చేయుచుంటిని. ఆనాళ్ళలో మైలాపూరు కపాలీశ్వరుని గుడిదగ్గఱ రంగమ్మ యను పుణ్యాంగన హోటలు పెట్టుకొనియుండెను. ఆమెకొక్కఁడేకొడుకు. ఆతడు వ్యర్థుఁడు. ఆయమ్మ భోజనమునకు వచ్చువారికి వారియిండ్లలోకంటె హాయిగా ననుకూలముగా నుండునట్లు వంట చేసి మంచి భోజనము పెట్టెడిది. ఆమె శ్రీ రెంటాల వెంకటసుబ్బారావు గారి దూరపుబంధువు. ఆమెభర్త చాలా శ్రోత్రియుఁడు, పుణ్యాత్ముఁడు నని సుబ్బారావుగారు చెప్పుచుండెడివారు. ఆమెను శ్రీ సుబ్బారావుగారు కొంతకాల మింట నుంచుకొని పోషించిరఁట ! కాని వృద్ధురాలు. స్వతంత్రజీవనార్థిని యామె యట నుండ నొల్లక వేర్వాసి వచ్చి హోటలు పెట్టినది. ఆమె పుణ్యస్మరణ మిప్పుడు నాకు ముదము గొల్పుచున్నది. నామీఁద నామెకు కడువాత్సల్యము. ఆ హోటలుకు వచ్చెడివారందఱు నామెను మాతృశ్రీనిగా గారవించుచుండెడివారు. కొందఱు హోటలు పెట్టుట నీచవృత్తి యందురు గాని యే వృత్తి యయినను నిర్వంచనముగా ద్రోహము లేకుండ సాగించుచో నది పుణ్యాపాదకమే కాఁగలదు.

ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు పదే పదే సందు దొరకినప్పు డెల్ల వెళ్ళుచు అక్కడి గ్రంథములు, అముద్రితములు పరిశీలించుచు, లోకల్‌రికార్డుల నెల్ల చదువుచు, అపూర్వాంశముల గుర్తించుచు, గుర్తించినవానిని మిత్రుల కుత్తరముల ద్వారా తెలుపుచు, తన్మయుఁడనై విద్యావ్యాసంగము చేయుచుంటిని. ప్రాచ్యలిఖిత పుస్తకశాలాధ్యక్షు లొకతూరి లైబ్రరీకి విచ్చేసి లైబ్రేరియన్ ద్వారా నా విషయములు తెలిసికొనిరి. తెలుఁగుపుస్తకములకు కేటలాగు వ్రాయుచున్న గుమాస్తా సెలవు పెట్టఁగా తోడ్తో నా స్థానమున నన్ను నియోగించిరి. అది టెంపరరీ పోస్టు. అందుచే ఆ గుమాస్తా తొలఁగెను. అతనిపై ఆఫీసువారి కతృప్తి. ఆతడు తొలఁగిన పిదప ఆ పోస్టును స్థిరముగావించి యందు నన్ను నియోగించిరి.

ఆనాళ్ళలో పాపులూరి మల్లనకవిని గూర్చి నా మూలమున చర్చ రేగెను. శ్రీ వీరేశలింగముపంతులుగారు కవుల చరిత్రలో వ్రాసిన తీరు సరిగాదని, పావులూరి మల్లన నన్నయనాఁటి మల్లన మనుమఁడని నేను లైబ్రరీలోని వ్రాఁతపుస్తకములఁ బరిశీలించి పత్రికలద్వారా నిరూపింపయత్నించితిని. అప్పటి మద్రాసు తెలుఁగుపత్రిక శశిలేఖ. వీరేశలింగముపంతులుగారి తరఫున నిలిచి అనేకులు నాపై చెలరేగిరి. వీరావేశముతో చిలుకూరి వీరభద్రరావుగారు లైబ్రరీపుస్తకములను నేను పసికుంకను జేరి దుర్బుద్ధితో మార్చివేయుచుంటినని, నేను వ్రాసినట్లు వ్రాఁత ప్రతులలో లేదని, గవర్నమెంటువారు నన్నక్కడ నుంచరా దని బాహాటముగా వ్యాసములు వ్రాయసాగిరి. ఇంకెందరెందఱో అటు తిరిగి నన్ను కటువుగా మందలింపసాగిరి. శ్రీ వీరేశలింగముపంతులుగారి పేరుప్రతిష్ఠ లట్టివి గనుక, వారి యాంధ్రసాహిత్యసేవ యంత మహనీయమయినది గనుక వా రెల్లరు నట్లుద్రిక్తుల యిరి. ఏవో కొన్ని పొరపాట్లుండిన నుండవచ్చును గాక అని సరిదిద్ద నొల్లక పోయిరి. వారందఱు సత్యమేది యని పరిశీలింపక వ్రాసినవారే. ఒక్క వీరభద్ర రావుగారే సత్యము స్పష్టముగా గుర్తింపఁదగియున్నను, లైబ్రరీ పుస్తకములు నేనేమి తార్మాఱుచేయకున్నను స్వార్థబుద్ధితో సత్యదూరముగా వ్రాఁత సాగించిరి.

ఆనాళ్ళలో ప్రాచ్యలిఖితపుస్తకశాలలో మహావీరాచార్యుని గణిత సార సంగ్రహమును ప్రొఫెసరు రంగాచార్యులుగారు ముద్రించుచుండిరి. మల్లన గణితము దానికిఁ దెలుఁగుగుట నేను గుర్తించి రంగాచార్యులుగారి కెఱిఁగించితిని. అప్పుడు వీరభద్రరావుగారి వ్రాఁతలను గూడ వారికి దెలిపితిని. అప్పుడు మా వివాదము నెల్ల హైకోర్టుకేసురికార్డులను పరిశీలించునట్టు పరిశీలించుచు శ్రీ వేపా రామేశముగారు నా వాదము సత్యమయినదని, ప్రతివాదము ఖండించి యసంబద్ధముగా, సత్యదూరముగా నున్నదని గుర్తించి, నా నౌకరికి కీడు దేఁజూచుచున్న వారి దురుద్రేకమునకు రోసి శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారితో నొకనాఁడు ముచ్చటించిరి. రంగాచార్యులుగారు నాకభయము చెప్పిరి. ట్రాన్స్లేటరు ఆఫీసువారు నామీఁది నిందను దొరతనము వారికి తెలుపునంతటి స్థితికి వచ్చెను.

ఇంత జరగినతర్వాత దొక్క చెదరిపోయందాఁక నాకు ప్రతికూలముగా నున్న వా రొకరు లైబ్రరీ వ్రాఁతప్రతులపాఠములనెల్ల శశిలేఖ పత్రికలో ప్రకటించిరి. అవి నా ప్రకటంచిన తీరునే నిరూపించెను. మఱియు కాకినాడలో

కార్వేర్ల శ్రీనివాసరావుగా రనువారు పావులూరి గణితపు తాలూకు ప్రతుల సంపాదించి యందలి పాఠములను శ్రీ పోలవరం జమీందారుగారు, దురిసేటి శేషగిరి రావుగారు వగైరాల సంతకములతో ప్రకటించిరి. అవి యెల్ల నేఁ జెప్పినట్లే యుండెను. అంతతో నా వివాద మడఁగారెను.

ఒకనాఁడు–"నార్తరన్ సర్కార్సు అసోసియేషన్" మీటింగు (యూనివర్సిటీ కాన్వకేషన్ తర్వాత) జరగుచుండఁగా నే నక్కడి కేగితిని. అచ్చటికి వచ్చియుండిన వీరభద్రరావుగారు నాయెడ వర్తించిన తీరునకు పశ్చాత్తాపము వెల్లడించిరి. మిత్రుల మయితిమి. ఆనాఁటి సభలో నా పద్యములు పఠింపబడెఁక జదువుటయ్యెను. ఆ యేడే శ్రీ కొంతి రామమూర్తిగారు గొప్పగా పరీక్షలో కడతేరి యింగ్లండుకు వెళ్ళు యత్నములో నుండిరి. నా పద్య మొకటి––

ఆంధ్రు లత్యంత దేహబలాఢ్యు లనెడు
కీర్తి హెచ్చెను మన రామమూర్తివలన
ఆంధ్రు లత్యంత బుద్ధిబలాఢ్యు లనెడు
కీర్తి హెచ్చెను మన రామమూర్తివలన.

వీరభద్రరావుగారు నాఁ డట్లు పశ్చాత్తాపము వెల్లడించిరే కాని కొన్నేళ్ళ తర్వాత మరల నాయెడ వికటముగానే వర్తిల్లసాగిరి. శ్రీనాథుని గూర్చి, ఇంకేవేవో విషయముల గూర్చి సత్యదూరము లయినవే కాక ధూర్తములు నయిన రచనముల నాయెడ జరపిరి. వాని కెన్నఁడు గాని వారికి నేను బదులు వ్రాయఁ దలఁపలేదు. శ్రీ వీరేశలింగము పంతులుగారు పరమపూజ్యులు, మహనీయులు నయ్యు నహమిక, మమకారము నధికముగాఁ గలవారని తర్వాత తలఁపనయ్యెను.

నిరుపమాన మహామహిమోపేతులు పురుషోత్తములు గంధిగారు పేర్వోలసిన పిదప మానవమర్యాదయే యసాధారణయోగ్యత నంతరించఁగల్గెను. వారి శీల జ్యోతిపుంజ మంతకు ముందు పేర్వోలసిన పెద్దల ప్రకాశము లెల్లో మిలమిల లాడ వలసిన దయ్యెను.

శ్రీ లక్ష్మణరావుగారు వీరేశలింగముపంతులుగారి నొకనాఁడు ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు గొనివచ్చి—వారప్పుడు కవులచరిత్రను సంస్కరించి ప్రకటింపఁ బూనియున్నారుగాన—వారి కస్మదాదుల సహాయము లభింపఁజేయుటకై జతనము సాగించుటలో నన్నెఱుక పఱచిరి. పావులూరి మల్లనచరిత్ర విషయములు వీరేశలింగముగారి దగ్గఱ, నా దగ్గఱ చర్చించి తత్త్వము నిర్ణయింప నభిలషించిరి. అన్ని వ్రాఁతప్రతులను జూపి నావాద మెఱిఁగించితిని. వీరేశలింగముగారికి వేఱు విధముగా, పూర్వము తాము వ్రాసినతీరుగా సమర్థింప నయితి గాదయ్యెను. లక్ష్మణరావుగారు జాగ్రత్తగా నెల్లవిషయము మరల ననువదించి వివరించి 'మీరిఁక నిట్లు మార్చుకోవలసినదే. మీరు తొలుత వ్రాసినదియు, మిమ్మసమర్థింప బూని యితరులు వ్రాసినదియు సరికాదని స్పష్టపడినది' అనిరి. పంతులుగారు 'నాదగ్గఱ వ్రాఁతప్రతి యేదో ఉండుటఁబట్టియే యట్లు వ్రాయుటయ్యెను. రాజమహేంద్రము వెళ్ళి నాదగ్గఱి గ్రంథములఁబట్టి మరల పర్యాలోచించి నిర్ణయింతును' అనిరి. లక్ష్మణరావుగారు 'ఇన్ని ప్రతులలో నున్న దానికి విరుద్ధముగా మీ వ్రాఁతప్రతి యుండదు. ఉండినచో నసిగా సమర్థముగా మీ వాదము నిర్వహించుకోవలసియుండును' అనిరి. 'పంతులుగారి పట్టుదలను పరిభావించుచు వీరేశలింగముగారికి మన ముందఱము సహాయము చేయుదము. వారిచేతనే కవులచరిత్ర సంస్కరణము జరపింతము' అని లక్ష్మణరావుగారు చెప్పిరి. నా చేతనయినంత తోడ్పాటు జరపుదు నంటిని. వా రిర్వురు నింటికి వెళ్ళిరి.

ఆటనుండి వీరేశలింగముపంతులుగారు బెంగుళూరు కొలఁది దినములకే వెళ్ళిరి కవులచరిత్ర ప్రథమభాగమున మాత్రము చేయవలసిన సంస్కరణములు నే నెఱిఁగినంత బెంగుళూరికి వ్రాసి పంపితిని. అది యొక పెద్దకట్ట. పంతులుగారు వాని నుపయోగించుకొనిరి. కాని వాని నాయాపట్టులందు పేర్కొననే లేదు సరికదా! గ్రంథపీఠికలో— 'శాస్త్రిగారును....తమ గ్రంథాలయములో నున్న పుస్తకభాగములను పద్యములను నేను కోరినవానిని వ్రాసి నా కెంతో తోడుపడిరి' అని వ్రాసిరి. వారి కేయే విషయములు కావలసియుండునో వానిని నేనే తెలిపి, లిస్టువ్రాసి, సంస్కరింపవలసిన చేర్చవలసిన విధానములు, పద్యములు వ్రాసి పంపఁగా ఆ విషయము నిట్లా స్మరించుట? ఈ సంస్కరణమున ఫలాని ఫలాని పద్యములను, గ్రంథములను వ్రాసి పంపవలసినదిగా వారుకోరగా నస్మదాదులము

వ్రాసి పంపినట్టు లర్థమగును. నే నన్నవాస్త వార్థమును దేవచ్చును. ఇంతే కాక తమకు చిరమిత్రులయిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిని గూడఁ జెనకిరి. ప్రబంధ రత్నావళినిగూర్చి యకారణముగా వారి కవులచరిత్ర పీఠికలోనే మరల నన్నును జెనకిరి. వాని నెల్ల వివరించుట రోఁత. నేను జాబులు వ్రాయఁగా జాలి జాలిగా వానికి బదుళ్లు వ్రాసిరి. ఆ జాబుల నిటీవల నేను చింపివేయబోగా తాము జాగ్రత్తగా నుంచుకొందుమని నా మిత్రులు గయికొనిరి.

ఇంత యెందుకు వ్రాసితి ననఁగా నాకు వాఙ్మయరంగమున క్రీడావినోద మనుభవింపవలెనని కొంతంతకోరిక చెలరేగుచున్నను, ఆదినుండి కూడ దాని కభ్యంతరములు, ప్రతిషేధములు తఱచుగా నడ్డు దగులుచు నిరుత్సాహముగొల్పు చున్నవని తెల్పుటకు. ఆ నాళ్ళలో ప్రతివాదోత్సాహము నాలో కొంత దూకు లాడుచునే యుండెడిది. అయిన నేమి? స్వర్ణకారుఁడు సువర్ణరజతములను గరఁగించుటకై తనముందు నిప్పులకుంపటిని నడుమ నంగారములుచేర్చి, దానిపై కుండమూకుటిని నెలకొల్పి, కుంపటినింత నుముక నించి యుంచుకొనును. వలసి నప్పు డంగారముల గొట్టముతో నూఁది యగ్ని ప్రజ్వలనము కలిగించుకొనును. ఆ యగ్ని కుండమూకుటి మూఁతకు లోబడియే మండనిచ్చును గాని పైకి ఉముక లోని కెగఁ బ్రాకనియ్యడు. అది నలువైపుల నుముకలోనికి వ్యాపింపజొచ్చినప్పుడు చుట్టును నీరుపోసి చల్లార్చును. ఆదినుండి నా స్థితి యించుమించుగా నట్లేసాగినది. బ్రదుకు సాగించుకొనుటకు వాఙ్మయసేవసాధనముగా నా కేర్పడినది గాన, అందులో అరకుడుపు సాగునట్లు పని చేయుటకే నా యంతర్యామి నన్ను మెసల నిచ్చినది గాని యంత కెక్కువగ పని చేయుటకు గాని, యంత కెక్కువగా సాధించుటకు గాని నాకు చోటియ్యకే పోయెను.



# 15

## టైఫాయిడ్

మైలాపూరునుండి ఎగ్మూరు మ్యూజియం బిల్డింగ్సులో నున్న ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు రాకపోకలు సేయుట, యెడతెఱపి లేకుండ నక్కడి సంస్కృతాంధ్రగ్రంథములను జదువుట, చదివిన గ్రంథములలోని ముఖ్యవిషయములకు నోట్సు వ్రాసికొనుట, కొన్నింటిని పత్రికలకు వ్రాయుచుండుట చేయుచుంటిని. రేయింబవళ్ళు విశ్రాంతి యెఱుఁగకుండ శ్రీ రామేశముగారు గ్రంథములు చదువుచుండుటను జూచుచుంటిని గాన నేను నట్లు సాగింపఁ గోరిక. పూర్వసుకృతము చేత వారికి సుకరముగా నుండెను గాని నా కది యసాధ్యముగానే ఉండెను. పగలు చదివిన గ్రంథముల యర్థములు రాత్రులందు గోచరించుచుండెడివి. నిద్ర తగ్గెను. నిద్ర పట్టనప్పుడెల్ల లేచి మరల జదువుచుండెడివాఁడను. దౌర్బల్యము నిరుత్సాహము పెరుగఁజొచ్చెను. ఇంటికి పోఁదలచి ఒక్క నెల సెలవు తీసికొంటిని.

సెలవు తీసికొన్న మర్నాడే నాకు తీవ్రజ్వరము వచ్చెను. డాక్టరు మందిచ్చుచుండెను గాని జ్వరము హెచ్చుచునే యుండెను. నాల్గయిదునాళ్ళయిన తర్వాత నాతఁడు స్వగ్రామమునకు కీతని పంపివేయుఁడని మా బావగారితో చెప్పెను. నేను కదలలేని స్థితిలో నుంటిని. మిత్రు లయిన పండిత గోపాలాచార్యులుగారికి కబురంపితిని. వారు వచ్చి చూచి 'నేను సుదూరమున నుంటిని. ఇక్కడి వైద్యులదగ్గఱనే మందు గొనుట మంచిదేమో! అనిరి. అందాఁక ఇంగ్లీషు వైద్యము నే నెఱుఁగను. మా నాయనగా రాయుర్వేద వైద్యులు. వారే ఎప్పుడయిన జ్వరాదులు వచ్చిన మందులిచ్చువారు. నా కందాక నంత తీవ్రవానారోగ్యము లెప్పుడును రాలేదు. 'ఆయుర్వేదవైద్యము పరిచితము గాన, మీరు మిత్రులు గాన మీరే మందియ్యండి' అంటిని. వారట్లే సమ్మతించి వైద్యము చేయబూనిరి. ప్రతిదినము ఆచారప్పన్ వీధినుండి మైలాపూరు శాలైతీవీధికి కొన్నిమైళ్లు కోచిమీద వచ్చి పోవుచుండిరి.

విరేచనముల కని యొకనాఁ డావగింజంత మాత్ర యిచ్చిరి వారు. పది రోజులనుండి నా కాహారమే సరిగా లేదయ్యెను. ఆమాత్రతో నానాఁడు నాకు నాల్గయిదు విరేచనము లయ్యెను. దొడ్డిలోనుండి యింటిలోనికివచ్చుట యెఱుఁగుదును. స్మృతి తప్పి పడిపోతిని. కొంతకు స్మృతి వచ్చినట్లయ్యెను. నాడి చూచుకొంటిని. నిమిషమునకు రెండు వందల దాపుగా కొట్టుకొనుసంఖ్య యుండెను. గుండె యెగసి పోవుచుండెను. దగ్గఱగా నున్న రామేశంగారిని పిలుచుకొని వచ్చిరి. వారు నాడి చూచి అపాయస్థితిలో నున్నట్లు గుర్తించి వెంటనే డాక్టరు నంజుండరావుగారికి చీటీ వ్రాసి మనిషిని బంపిరి. నాస్థితి గందరగోళముగా నుండెను. అప్పుడే కాచిన పాలు రెండళాకులు గబగబ త్రాగివేసితిని. పదినిమిషములకు ప్రాణ మందుకొను చున్నట్టు తోఁచెను. అంతలో నంజుండరావుగారు వచ్చి పరీక్షించిరి. 'తీవ్రమయిన టైఫాయిడ్ జ్వరము. వెంటనే యీ క్రింది మందులు తెచ్చియియ్యండి' అని చీటి వ్రాసి యిచ్చిరి. గుడ్విన్ కంపెనీవారు మందు లిచ్చిరి. ఆ మందులు త్రాగిన పదినిమిషములకే ప్రాణము సరిగా చేరుకొనెను. జ్వరము 22 దినములకు తగ్గినది. ఈ నడుమ కొన్ని యొడుదుడుకు స్థితులును గలిగినవి. ఏమి కలిగినను వారిచ్చిన మందులు వెంటవెంటనే నాకు గుండె నిబ్బరము కలిగించుచు వచ్చెను.

ఒకనాఁడు విరేచనము లగుట కేదో కొంచెము మందిచ్చి మామూలు మందులు పుచ్చుకొనవలదనిరి. ఆనాఁడు నాకు నిస్త్రాణ హెచ్చెను. డాక్టరు రాగానే 'దినము త్రాగే మందు నేడు త్రాగవద్దంటి రట! అవి త్రాగగానే నాకు పుష్టి కలిగెడిది. నే డట్లు లేదు' అంటిని. ఆయన నావీపు చఱచి, నవ్వి 'మరల వానిని తీసుకొనుడు' అనిరి. జ్వరము తీసిన తర్వాత అవి చికిన్‌బాతు బ్రాందితో కలిపిన దొకటి, ద్రాక్షాసవమువంటి దింకొకటి యగుట తెలియవచ్చెను. ఆతర్వాత రోఁత గొంటిని. కాని యిప్పటిదాఁక నా కవి యమృతకల్పములుగా దోఁచెను.

ఆ జ్వరతీవ్రతలో నా జీవితమునుగూర్చి సంశయ మేర్పడి మా బావగారు జాబు వ్రాయగా నా మిత్రులు శ్రీ కాశీభట్ల కుమారస్వామిశాస్త్రిగారు, మా మామ గారు, మా తలిదండ్రులును, అన్నగారు మద్రాసు వచ్చిరి. ఆ తీవ్రవనారోగ్యపు నాళ్ళలో తమకుమార్తె రజస్వల యయ్యెనని మా మామగారు జాబు వ్రాసిరి. ఆ [illegible] గొప్పగ [illegible] జ్వరము తగ్గినది. ఆరోగ్య వంతుఁడ నయితిని. నాస్థితి విని విచారించి నంజుండరావుగారు [illegible]

పెట్టి యింటికి పోవలసిన దనియు, ఇతరవ్యాధు లేవి లేవు గాన వడివడిగా ఆరోగ్యము కోలోఁగల దనియు, ఆ టైఫాయిడ్ జ్వరం తగ్గినతర్వాత నూటతొంబది మందికి సహజముగా సంపూర్ణారోగ్యము పెంపొంది జ్వరమునకు పూర్వ ముండిన యనారోగ్యవాసనలుకూడ తొలఁగి విజృంభణముతో నుండ గల్గుదు రనియు, సంపూర్ణారోగ్యము బలము పడసి మూన్నెల్ల తర్వాత గార్హస్థ్యసుఖస్థితిని బడ యుదుగా కనియు, ఆర్నెల్ల తర్వాత మద్రాసుకు సకుటుంబముగా వచ్చి వేయు దువ్వ. గా కనియు ననిరి.



# 16

## వేంకటేశ్వరస్వామి దర్శనము

అప్పటి నా జీవితాశలు రెండు. మా తల్లిదండ్రు లెప్పుడో మ్రొక్కు కొన్న శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామిని దర్శించుట యొకటి. నాకు పసితనము నాఁటనుండియు దేవాలయముల కరుగుట గాని, అక్కడ స్వామిదర్శనము లభించు నని నమ్ముట కాని, అక్కడి విగ్రహముల కర్చనాదికము జరపుట కాని యిచ్చ గొల్పని ముచ్చట తిరువళిక్కేణిలోగాని మైలాపూరులో గాని దేవళములలోనికి స్వామిదర్శనార్థమై యెన్నఁడు గాని నేనై వెళ్ళి యెఱుఁగను. కాని యప్పుడప్పు డేవో నా మనోభావములను పద్యములతో తిరువళిక్కేణి పార్థసారథిస్వామి స్తుతిగా వెల్లడించుట కలదు. ఇట్టి వానికి నాకు తిరుపతి వేంకటేశ్వర స్వామి దర్శనమున ముచ్చట యంత తీవ్రముగా నేల కలిగెనో నాఁడు గుర్తింప గుదుర లేదు. 'కలౌ వేంకటనాయకః' అన్న శ్లోకాంశము నన్ను క్రమ్ముకొన్నది.

మే మందఱము మ్రొక్కు చెల్లించుకొనుటకు (అనఁగా చిరంజీవి మా తమ్మునికి శంకరున కుపనయనము స్వామి సన్నిధిని చేయుటకు బయలుదేరితిమి. మద్రాసునుండి బయలుదేరి తిరుపతికి వచ్చుటలో నిజముగా నాకు స్వామిసన్నిధికే వచ్చుచున్నంత యుప్పొంగు అఖిలాండనాయకుఁ డగువాని, విశ్వమును విష్ణువును, వషట్కారుని, భూతభవ్యభవత్ప్రభువును కన్నులార కాంతును గదా! ధన్యుఁడ నగుదును గదా! అదుగో ఇదిగో చేరబోవుచున్నాను అని మురియఁ జొచ్చితిని అప్పుడే తీవ్రవానారోగ్య విముక్తుఁడ నయితిని గాన దౌర్బల్యము ప్రబలముగా నున్నను నీ యుత్సాహము నన్నుద్బోధింపఁగా స్వామిపై నేవో పద్యములు పయనములో రచింపఁదొడఁగితిని. తిరుచానూరిలో నుపనయనము జరపితిమి. స్టేషను నుండి యెండలో నాయూరు చేరుటలో మా యన్నగారి కుమార్తెకు పసిబిడ్డకు తీవ్రజ్వరము వచ్చెను. జ్వరము తగ్గుదాఁక నేనదే చేయుదునని కూర్చుండి పద్యములతో స్వామిస్తుతి చేయఁ జొచ్చితిని. జ్వరము కొన్ని గంటలలో తగ్గిపోయెను. పద్యములు చాల రచించితిని వానిలో నొకటి రెండు:—

చుట్టిని మేను కాలెఁ గనుచూడ్కి వికారము దోచె నన్నకుం
గుట్టిది యాఱుమాసములకూన యిదెక్కడి వేకిసోకొ మా
మొట్టల నాలకింపుము నమోనమ! యప్పన నీకు నప్పనా
చిట్టిన చీదకుండ సుఖసిద్ధికిఁ దార్పుమి బిడ్డఁ దేర్పుమీ!

జ్వరము తగ్గినపై

అంకిలి లేనిభక్తి మనసారఁ దలంచి నమస్కరించి మా
సంకట మార్పవే యన వెసన్ సుఖ మిచ్చి యనుగ్రహించి తో
కింకర కల్పకంబ! పరికించితి నీమహనీయతన్ 'కలౌ
వెంకటనాయకో' యను సువిశ్రుత సూక్తియథార్థభావముఁ.

ఆనందముతో నందఱము గొండ లెక్కితిమి. వృద్ధులుగాన మా నాయనగా రంతకు ముందు పలుతూరులు స్వామిదర్శనము చేసినవారు గాన దిగువతిరుపతి లోనే కొలఁది కాలము క్రిందటనే కట్టిన 'పుష్పతోట' సత్రములో నుండిరి. స్వామి దర్శనమునకై యువ్విళ్ళూరుచు వెళ్ళితిని కాని యక్కడ నాకెంత తంటాలుపడినను స్వామిమూర్తి దర్శనము లభింపలేదు. మద్రానునుండి మహంతుగారికి, వారిదగ్గఱి నుండి కొండమీఁది యుద్యోగులకు జాబు గొని వెళ్ళితిమి కాన యక్కడ వలయు సౌకర్యములు లభించెను. మావారందఱు కొంత యలజడి, త్రొక్కటమును జెందినను స్వామిదర్శనము సరిగాఁ జేసికొని తని సిరి. నేను చాలసేపు స్వామి మూర్తిని చూడ యత్నించి విఫలమనోరథుఁడ నయితిని. ఎంత యత్నించినను చెదరి చీకటి గానవచ్చెను కాని నాకక్కడ స్వామిమూర్తి గోచరింపదయ్యెను. చాల నిరుత్సాహము చెందితిని. దుష్టుఁడ నని దురపిల్లితిని. పాపిష్ఠుఁడ నని పలవించితిని. ఏమియుం దోఁచక యేడ్చితిని. అనారోగ్య దౌర్బల్యముచే నక్కడి మూర్తి దర్శనమునకు కనులు మిఱుమిట్లు గొని యుండు నని, స్వామికి నాకు నడుమ దివ్వెవెలుఁగుండుటచే నది యడ్డువచ్చి మూర్తిని గానరానీయ దయ్యెనని, నా పాపకర్మముచే దర్శనము లభింప లేదని పరిపరియోచనలు, వాని కేవో యపవాదములు తోఁచసాగెను. ఏమి తోఁచినను స్వామి గోచరింపఁ దయ్యెనే కదా యన్న యారాటము నన్ను వీడలేదు.

ఈ సందర్భ మీ గ్రంథము రచించునాఁటి కిందుమించుగా నల్వదియేండ్లకు పూర్వము జరిగినది. 1910వ సంవత్సరము నాఁటి దీ వృత్తాంతము. తర్వాత 1930 నుండి తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి కొంత యెఱుక నాకుఁ గలుగసాగెను. 1949 నాఁటికింక నెన్నో విషయములు గోచరించెను. వాని నాయాసందర్భములలో సక్రమముగా వివరింతును.



# 17

## తొలి కలయిక

నాకు టైఫాయిడ్ తగ్గి యారోగ్యము లభించునాఁటికి జీవితవాంఛలు రెండు గల వంటిని. తొలిది శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి దర్శనము. అది తొలుత నగమ్యగోచరముగా నుండుట, యీనాఁటికిఁ జాల విషయములు దెలియ నగుట రేఖామాత్రముగాఁ జెప్పితినిగదా! రెండవది వివాహ మాడితిని గనుక అచుంబితప్రక్రియ యగు స్త్రీసుఖము ననుభవింప గోరుట. అది యేదో వేంకటేశ్వర దర్శనమువలె నపూర్వాద్భుతాతిలోకానందము గొల్పునదిగా నుండఁగల దనుకొనుచు నువ్విళూరుచుంటిని. ఈ రెండు నెఱవేరినచో నా జీవితప్రయోజనము లభించినట్టే యనుకొంటిని.

తిరుపతి నుండి యింటికి వెళ్ళిన తోడ్తో నారోగ్యవృద్ధి క్షణక్షణ విజృంభణము గాఁజొచ్చినది. మా తలిదండ్రులు వగైరాలు మద్రాసు నుండి వచ్చుదాఁక ఇంచుమించుగా పదునైదునాళ్ళు నా మిత్రులు శ్రీ సుసర్ల కుమారస్వామిశాస్త్రి గారి యింటనే యుంటిని. వారును, వారి కుటుంబిని శ్రీమతి రామమ్మగారును నన్ను బిడ్డనుగాఁ గాపాడిరి. ఆకలి నా కమితముగా రేగుచుండెను. ఎక్కువగా భోజనము చేసెడివాఁడను. దృష్టి తగులు నని రామమ్మగారు నాకు చాటుగా నెవ్వరు చూడకుండునట్లు భోజనము పెట్టుచుండెడివారు. ఆ దంపతులు నేఁడు లేరు. వారి పుణ్యగతికై తలఁపునకు వచ్చినప్పు డెల్ల తపించుచుందును. కుమారస్వామి శాస్త్రిగారిని నేను నా భక్తిరహిత తారకరాజయోగానుష్ఠానమున తర్వాత 1917వ సంవత్సరమున చేర్చితిని. కాని వారు దుర్బలమయిన చిత్తవృత్తి కలవారు గాన యిందు శ్రద్ధాళువులు కారయిరి. దుస్స్నేహవాసముల మరగి సంపదారోగ్యములను సంపూర్ణముగాఁ జెడగొట్టుకొనిరి. వారి భార్యగారు ముందుగాను, 1928 ప్రాంతముల గాబోలు వారును చనిపోయిరి.

కుమారస్వామిశాస్త్రిగారు చనిపోయిన పదవనాఁడు నేను ధ్యానము చేసుకొనుచున్నప్పుడు [illegible] స్పష్టముగా గోచరమై చిఱునవ్వు నవ్వుచు

'నీ మంచి సహవాసమును దూరస్థుఁడనుగా నుండుటచే కోల్పోయి నీమాట వినక దుస్సహవాసముల జిక్కి చెడితిని. శారీరక వాంఛలు నన్నట్టుగా నాకట్టుకొని పెడమార్గము బట్టించినవి. చక్కబఱుప సాధ్యముకాని తుచ్ఛశరీరము తొలఁగెను. ఇఁక నీ గోష్ఠిలో నేను సుప్రతిష్ఠిండనుగా నుందును' అని లజ్జాగర్భితముగా పలికి నాతో ధ్యానమగ్నుఁ డగుట కానవచ్చెను. శీలము పవిత్రముగాకున్నను, ఉపకారప్రకృతి యాతనికడ నసాధారణమైనదిగా నుండెడిది. ఆర్తతలో నున్న వారి కెందఱకో ఆతఁ డుపకరించెడివాఁడు. తన కల్మినందుకుఁ గోల్పోయెను. ప్రధానముగా నాయెడ నాతఁడు నెఱపిన సౌహార్ద వాత్సల్యములకే, ఆ సుగుణము నకే శాశ్వతముగా నా జీవు డుద్గతి నొందుగా కని తపించుచుందును.

వారి యింట పదిహేనురోజుల కెక్కువ కాలమే అప్పుడుంటిని. అంతలో మా తల్లిదండ్రులు వెగ్గెరా లింటికి వచ్చిరి. మూఁడు నాలుగు నెలలకు నే నంతకు ముం దెన్నఁడు నెఱుఁగని యారోగ్యము పొందితిని. నా తలఁపును గుర్తించినవా రగుటచే మా తలిదండ్రులు, నక్కగారును పునస్సంధాన ముహూర్తము నిర్ణయించుటకు మా యత్తవారిని గోరిరి. ఇంకను గొంతకాలము గడవఁదగు ననుకొన్నను మా కష్ట సుఖముల నాలించి మా మామగారు ముహూర్త నిర్ణయమున కంగీకరించిరి. కొలఁది రోజులు ముందుగా మా సోదరికి గూడ పునస్సంధాన ముహూర్త మేర్పఱచిరి.

అంతదాఁక బులపాటము చెందుచున్న నాకు ముహూర్త నిర్ణయము నాటి నుండి చాల మనోదుఃఖము రేగెను. నా వ్యాకులతను గుర్తించిరే కాని కారణ మేదో యెవ్వరు నెఱుఁగరు. తొలుత నేను నెఱుఁగను. కారణ మెఱుఁగ రాకుండ వ్యాకులత పెరుగసాగెను. వివాహము నాఁటినుండియు నా జీవితము క్లేశముల పా లగుచుంటుట, దానికి కారణము పెండ్లాడిన పిల్ల జాతకము పొంతనములు సరి పడినవి కాకపోవుట యని మావారు చీకాకు చెందుట యని వెదకి వెదకి కొంత గుర్తించితిని. నా వివాహమునాఁడు వధువు జాతకము చూపింప గోరఁగా మా మామగారు నేను జాతకము వ్రాయలేదని చెప్పివేసిరి. కాన దాని గుణదోషములు గుర్తింప వీలుపడదయ్యెను. అసలు నాకు జాతక-పరిశీలనము మీఁద విశ్వాసమును లేదయ్యెను. 'యస్యాం మనశ్చక్షుషో ర్నిబంధ స్తస్యా మృద్ధిః' అన్న ధర్మ

సూత్రము నాకు నచ్చి నేను మనసార ప్రేమించి యా పిల్లను పెండ్లాడితిని గాన నా కప్పుడు కొఱంత తోఁపలేదు.

అప్పటివఱకు ఆ వధువు నాకు ధర్మపత్నిగా నాతో సంసారయాత్ర సాగింప నున్నది సుమా యన్న తలఁపే కాని యంత యెక్కువ యోచనలు లేవు. ఇఁకమీఁద నా వధువు మా యింటికి రానున్న దని, వివాహప్రయోజన మిఁక మీఁదనే అనుభవింప నుండె మని, నా హృదయము నే నెఱుఁగుదు ననుకొను చుంటిని గాన, ఆమె హృదయము నా కర్పించి నా హృదయము నప్పన గొనుటో, తన హృదయమును నా కర్పింపక నా హృదయమును హరించుటో యేది చేయునో యనీ, అంతదాఁక న న్నత్యంతము ప్రేమించుచున్న మా తలిదండ్రుల కా పిల్ల ప్రేమపాత్ర మగునో కాదో అనీ, ఆ పిల్ల వారి నెంత యేడ్పించునో అనీ, నా యన్నదమ్ములకు, అక్క చెల్లెండ్రకు, నాకుఁ గల సౌమనస్య మిఁక ముం దేమి కానున్నదో కదా అనీ వెఱపు. క్షణక్షణమునకు స్పష్టాతిస్పష్టముగా విచారము పెరుగ సాగెను. మఱియు మా తలిదండ్రుల చాటుననే యంతదాఁక నా జీవితము సాఁగుచుండెను. సర్వభారము వారు మోయుచుంటఁగా నిర్భయుఁడనై నే నుంటిని. నా దృష్టిని వారు ప్రాలి యస్తమింప బోవుచున్నట్టును, నే నొక వంశవృక్షమును వెలయించి యుచ్చస్థాన మాక్రమింప బోవుచున్నట్టును దోచసాగెను. నే నంత నిర్వహింప గల్గుదునా ? మా తలిదండ్రు లున్నంత దాఁక వారి చాటువాఁడ నగుటే శ్రేయము గాదా ? నేను వెలయింపఁ బోవు వంశవృక్షము మా తలిదండ్రులు వెలయించిన వంశవృక్షముతో పొంది పొసఁగి లోబడి యుండ వలదా? ఏమగునో ? నా జీవితమార్గము మంచికో, చెడుగుకో దారి త్రొక్క నారంభించు సంఘటన దాపురించినది. ఎందఱ కుటుంబములో యిట్టిపట్టుల నపమార్గములఁ బట్టినని కానవచ్చినవి. ఇంక నెందఱ కుటుంబములో సన్మార్గముల బట్టినవి కానవచ్చినవి. ఏవం విధమయిన చింతలో, అలజడిలో కొట్టుకాడుచున్న నా ముఖమున నశాంతిలక్షణములు ప్రవ్యక్తముగా గోచరించుచుండెను. వానిని జూచి మా తల్లిదండ్రులు, నక్కగారు త్రొక్కట పడఁజొచ్చిరి.

సంతోషము గాని సంతాపము గాని యంతరంగమును కలవరపఱచు చున్నప్పుడు దాని చేష్ట యకృత్రిమముగా, స్పష్టముగా నున్న దున్నట్లు కొందఱ ముఖమున గోచరించును. కొందఱు లోని సంతోషము దాఁచి యుంచుకొని

